

ఏమర్రా! మీరు నన్నెప్పుడయినా చూశారా? ఆఁ....గుర్తొచ్చానుగదూ—బామ్మని! 'వనిత' పత్రిక మీరు చదువుతూవుంటే, నేను మీకు కచ్చితంగా గుర్తుంటాను....మరి, నేను రాస్తున్నవన్నీ చదువుతున్నారా? మూఢనమ్మకాల గురించి, ఆడపిల్లల చదువుల గురించి, పెరటి మందుల గురించి, పండగల గురించి, మన పూర్వీకుల విధానాల గురించి—ఇలా—నేను రాస్తున్న విషయాలన్నీ బాగుంటున్నాయని, పాఠకులందరూ రాస్తున్న ఉత్తరాలు చూస్తున్నప్పుడు ఎంతో ఆనందంగా వుంటుంది. ఏదో, పాత కాలపుదాన్ని. నేను చెప్పే విషయాలు మీకు నచ్చవేమో అని ముందుగా భయపడ్డానుగాని, మీ ఉత్తరాలు నాకు ఎంతో ఉత్సాహాన్నిస్తున్నాయర్రా! ఆ వ్యాసాలు చదివినప్పుడు, మీరెంత ఆనందం పొందుతూ వుంటారో, అవి బాగుంటున్నాయని మీరు అంటున్నప్పుడు నేను అంతకంటె ఎక్కు వ ఆనందమే పొందుతున్నాను. ఇలా—మిమ్మల్నందర్నీ నాకూ, నన్ను మీకూ పరిచయం చేసిన 'వనిత'కు మన అందరం కృతజ్ఞతలు చెప్పుకోవాలి. మరి, నా వ్యాసాల గురించి, మీ మిత్రులు ఏమంటారో! చదవకుండా వున్నట్టయితే—'వనిత' చదవమని వాళ్ళకీ చెప్పండి. ఏం?....

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["బికారి యోగి"] కర్లపాలెం హనుమంతరావు రచన.

కొందరు ధూర్తులు మాయోపాయాలచేత తమకు దైవిక శక్తులున్నట్టు నటించి, పట్టుబడినదాకా లాభం పొందుతారు. ["జ్యోతిష్కుడి గీత"]. మరికొందరు యాదృచ్ఛికంగా, తమ ప్రయత్నం కొంచెం కూడా లేకుండా, దైవిక శక్తులున్నట్టు ప్రజలకు అభిప్రాయం కలిగిన కారణంగా పైకి వచ్చి, తాము బాగుపడే అవకాశాలున్నప్పటికీ, వాటిని తోసిపుచ్చుతారు. బేతాళకథలో ఇదే జరుగుతుంది.

సంపుటి 62 ఫిబ్రవరి '78 సంచిక 2

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00






న హ్యతో ధర్మచరణం
కించి దస్తి మహత్తరమ్,
యథా పితరి శుశ్రూషా,
తస్య వా వచనక్రియా. 1

[తండ్రికి సేవలు చేయటమూ, తండ్రి మాట పాలించటమూ కన్న గొప్ప ధర్మం లేదు.]

అస్మాకం చ కుతే పూర్వం
సగర స్యాజ్ఞయా కితుః
ఖనద్భి స్సాగరై ర్భూమి
మవాప్త స్సుమహా, న్వధః. 2

[పూర్వం "మా" సూర్యవంశంలో సగరుడి ఆజ్ఞానుసారం భూమిని తవ్వి అతని కొడుకులు చనిపోయారు.]

జమదగ్న్యేన రామేణ
రేణుకా జననీ స్వయం.
కృత్తా పరశు నారణ్యే
పితుర్వచన కారిణా. 3

[జమదగ్ని కొడుకైన పరశురాముడు తండ్రి మాట పాటించి అరణ్యంలో తన తల్లి అయిన రేణుకను గొడ్డలితో నరికాడు.]




## 56

తరవాత అరిమర్దనం ప్రాకారకర్ణం అభిప్రాయం ఏమిటని అడిగింది.

"ప్రభూ, ఈ కాకిని చంపరాదు. దీన్ని కాపాడినట్టయితే, ఇది మనకు ఆప్త మిత్రుడై, సలహాదారుగా పని చేయవచ్చు. నీ మిత్రుణ్ణి ఎప్పటికైనా శత్రువుకాగల వాణ్ణిలాగా చూడటమూ, శత్రువును ఎప్పటికైనా మిత్రుడుకాగల వాడుగా చూడటమూ రాజనీతి. అదేగదా 'రాజకుమారుడి పొట్టలో పాము' కథ నుంచి మనం నేర్చుకునేది?" అన్నది ప్రాకారకర్ణం.

"ఏమిటా కథ?" అని అరిమర్దనం అడగగా, ప్రాకారకర్ణం ఇలా చెప్పింది:

ఒకానొక రాజ్యాన్ని దేవశక్తి అనే రాజు పాలించేవాడు. అతని ఏకపుత్రుడు యువరాజు. కాని అతని పొట్టలో ఒక పాము చేరటం చేత, అతను రోజురోజుకూ కృశించసాగాడు. దేవశక్తి ఖిన్నుడై, ప్రతి దేవాలయానికీ వెళ్ళి, తన కొడుకు పొట్టలో నుంచి పామును తొలగించమని అక్కడి దేవతలకు మొక్కుకున్నాడు. తన మంత్రుల సలహా ననుసరించి అతను తన కొడుక్కు పొరుగుదేశపు రాజకుమార్తెను పెళ్ళికూడా చేశాడు.

ఈ రాజకుమార్తె తెలివైనది. ఒకనాడు ఆమె బయటికి వెళ్ళి, తిరిగి వస్తూ, తన భర్త ఒక పుట్ట మీద తల పెట్టుకుని నిద్ర పోతూండటం చూసింది. రాజకుమారుడి పొట్టలో ఉండే పాము అతని నోటి నుంచి తొంగి చూస్తున్నది. ఆ సమయంలో పుట్టలోని పాము కూడా తల బయట పెట్టింది.

పుట్టలో ఉండే పాము రాజకుమారుడి పొట్టలో ఉండే పాముతో, "ఓసీ, ఆ అంద



మైన రాజకుమారుడి పొట్టలో చేరావా?'' అన్నది. రాజకుమారుడి పొట్టలో పాము దీనికి జవాబుగా, ''ఓసీ, నువు నీ పుట్టలో లంకెబిందెలు దాచుకోలేదా?'' అన్నది.

''బుద్ధి తక్కువదానా! నల్ల అవాలూ, మిరపకాయలూ, వామూ కషాయం పట్టి తాగితే నీ పని గోవిందా!'' అన్నది పుట్టలో పాము.

''ఉడుకు నీళ్ళు పుట్టలో పోస్తే నీ పని మాత్రం గోవిందా కాదా?'' అన్నది పొట్టలో పాము.

రాజకుమార్తె ఈ సంభాషణ విని, పుట్టలో పాము చెప్పిన ప్రకారం కషాయం కాచి, తన భర్త చేత తాగించింది. పొట్టలో పాము చచ్చి, బయటపడింది. తరవాత ఆమె పుట్టలో ఉడుకు నీళ్లు పోసి, పామును చంపి, లంకెబిందెలను తవ్వి తీయించింది.

అరిమర్దనం తన అయిదుగురు మంత్రుల అభిప్రాయమూ విన్నమీదట అధిక సంఖ్యాకుల సలహాను స్వీకరించింది. తన సలహాను అరిమర్దనం తోసిపుచ్చినందుకు రక్తాక్షి, ''సోదరులారా, మీరు మీ సలహాతో రాజుకు మరణ దండన విధించినంత పని చేశారు. మీ మూలాన రాజు, వెనకటికి కథలో వడ్రంగి లాగ మోసపోయాడు,'' అన్నది.

''ఏమిటా కథ?'' అని అరిమర్దనమూ, ఇతర మంత్రులూ అడిగిన మీదట రక్తాక్షి ఇలా చెప్పింది:

ఒక వడ్రంగి ఉండేవాడు. అతని భార్య జారిణి. ఆ సంగతి ఊరంతా తెలుసు. తన భార్య పేరు నలుగురి నోటా నానటం చూసి, వడ్రంగి నిజం తెలుసుకోవాలనుకున్నాడు.

అతను తన భార్యతో, ''నేను రేపు దూర ప్రయాణం మీద పోతున్నాను. కొన్ని రోజుల దాకా రాను,'' అన్నాడు. ఈ మాట విని అతని భార్య పరమానందం చెంది, అతని కోసం రకరకాల పిండి వంటలూ, మిఠాయీ చేసింది.

మర్నాడు ఉదయం మొగుడు బయలు దేరగానే అతని భార్య చక్కగా ముస్తాబై, తన ప్రియుడు కాగోరుతున్న దేవదత్తు డనే వాడి ఇంటికి వెళ్ళి, "నా పిశాచం మొగుడు ప్రయాణమై వెళ్లాడు. కొన్ని రోజుల దాకా రాడు. ఇవాళ రాత్రికి మా యింటికి వచ్చావంటే మనం యథేచ్ఛగా వుండవచ్చు," అన్నది.

వడ్రంగి పగలంతా సమీపంలో ఉన్న అరణ్యంలో గడిపి, చీకటిపడేవేళ దొడ్డి దారిన భార్య కంటపడకుండా లోపల ప్రవేశించి, మంచం కింద దాక్కున్నాడు.

తరవాత కొద్దిసేపటికి దేవదత్తుడు వచ్చి, ఆ మంచం మీద పరిచిన పక్క మీద కూర్చున్నాడు. తరవాత వడ్రంగి భార్య కూడా వచ్చి మంచం మీద కూర్చున్నది. అలా కూర్చునేటప్పుడు ఆమె కుడికాలు, మంచం కింద దాగిన వడ్రంగికి తగిలింది. తనను పరీక్షించ టానికి తన భర్త మంచం కింద దాక్కున్నాడని తెలుసుకుని, ఆమె దేవదత్తుడితో, "అయ్యా, నేను మహా పతివ్రతను!" అన్నది.

"అలా అయితే నన్ను ఎందుకు రమ్మన్నావు?" అని దేవదత్తుడు ఆమెను అడిగాడు.

"నేను కాళికాదేవిని రోజూ పూజిస్తాను. ఇవాళ దేవి నాతో, నా భర్త ఆరునెలలకు పోతాడనీ, నేను నా భర్త ప్రాణాలు దక్కించుకుని, వైధవ్యం రాకుండా చూసుకోవాలంటే నా పాతివ్రత్యాన్ని త్యాగం చెయ్యాలనీ అన్నది. నాకు పాతివ్రత్యం కన్న పతే ఎక్కువ. అందు చేత అమూల్యమైన నా పాతివ్రత్యాన్ని నీకు ధారపోయ దలచి, నిన్ను రమ్మ న్నాను," అన్నది ఆ కులట.

ఈ మాటలతో మోసపోయిన వడ్రంగి, "లోకులెటువంటి మూఢులు! నా భార్య వంటి మహాపతివ్రతకే రంకులు కట్టారే!" అనుకుని, తన భార్యను శంకించినందుకు ఆమెకు క్షమాపణ చెప్పుకున్నాడు.



# 194. అనాగరిక సామర్థ్యం

పెరూ (దక్షిణ అమెరికా) లోని కుజ్కోకు ఎగువన కొండల మీద విస్మయకరమైన దుర్గం నిర్మించిన వారు ఆదిమవాసులు. బొమ్మలో కనిపించే ప్రాకారంలోని రాళ్ళు కొన్ని 15 నుంచి 20 అడుగుల ఎత్తుదాకా ఉన్నాయి. రాళ్ళ మధ్యన ఎలాటి "అడుసు" కూడా లేదు. రాళ్ళ మధ్య చాకు "బ్లేడు" కూడా దూరదు. దీన్ని నిర్మించిన వారు ఇనుము ఎరగరు; రాతి పరికరాలూ, పేనిన తాళ్ళూ, అనాగరిక సాధనాలూ ఉపయోగించారు.





# మాయాసరోవరం

## 26

[నరభక్షక జాతివాళ్ళకు, మాయాసరోవరేశ్వరుడు దొరికిన సమయంలో, అక్కడికి సిద్ధ సాధకుడు వచ్చాడు. తన యజమానిని రక్షించబోయి, మకరకేతు, సాధకుడి బంటయిన జలవృకరాక్షసుణ్ణి గాయపరిచాడు. నరభక్షకులు వాళ్ళను పట్టబోయేసరికి, అందరూ ఏకమై వాళ్ళమీద తిరగబడ్డారు. అంతలో కొందరు అశ్వికులు అక్కడికి వచ్చారు. తరవాత—]

సిద్ధసాధకుడు పదునైన శూలాన్ని తన గుండెలకు అనించగానే, మాయాసరోవరేశ్వరుడు భయంతో కంపించిపోతూ, "ఇది అన్యాయం! వీరుడైన వాడెవడూ శత్రువును అదమరిచి వుండగా చంపేందుకు ప్రయత్నించడు." అన్నాడు.

ఆ వెంటనే సిద్ధసాదకుడు శూలాన్ని నేలకు అనించి, "నేను వీరుల్లోనూ, వీరాధివీరుణ్ణి! ఏదీ కత్తి దుయ్యి, నీ బలదర్పాలే పాటివో చూస్తాను," అన్నాడు.

మాయాసరోవరేశ్వరుడు కత్తి దూయబోయినవాడల్లా ఆగి, మకరకేతు కేసి చూశాడు. అంతలో అశ్వికుల నాయకుడు వచ్చి గుర్రం దిగాడు.

సిద్ధసాధకుడు కోపంగా అతడి కేసి చూస్తూ, "ఎవరు నువ్వు? మా తగాదాల్లో నీకేం పని?" అని అడిగాడు.



ఆ ప్రశ్నకు అశ్వికుల నాయకుడు వెంటనే జవాబు చెప్పకుండా సాధకుణ్ణి నిలువెల్లా ఒకసారి పరీక్షగా చూసి, "ఆఁ, నువ్వా! నువు సిద్ధసాధకుడివి కాదా? కొన్నాళ్ళ కిందట హిరణ్యాపురంలో, కాటికాపరిని తల నరికిన నేరానికి, మరొకరితోపాటు నువ్వూ, రాజుగారి దగ్గిరకు తీసుకుపోబడ్డావు, అవునా?" అన్నాడు.

"నే నెవరైనదీ నీకు తెలిసింది, నువ్వెవరో గుర్తుకొచ్చిందిగాని, పేరు మాత్రం తెలియటం లేదు," అన్నాడు సిద్ధసాధకుడు.

"నా పేరు వీరసేనుడు. అపహరించుకుపోబడ్డ కనకాక్ష రాజుగారి కుమారుణ్ణీ, కుమార్తెనూ వెతికి తెచ్చేందుకు బయలుదేరిన జయశీలు డెక్కడ?" అన్నాడు వీరసేనుడు.

"ఆ జయశీలుడు హంసల రథంలో, ఆకాశంలో ఎక్కడో ఎగురుతూంటాడు. సరే, నువు కాస్త పక్కకు తప్పుకో. వీరుడిలాగా ప్రగల్భాలు పలికే యీ భీరువైన నీటిమనిషి అంతం చూడాలి ముందు," అంటూ సిద్ధసాధకుడు శూలాన్ని పైకెత్తాడు.

"ఇక్కడ రక్తపాతాన్ని నేను సహించను!" అంటూ వీరసేనుడు, తన

అశ్వికుల నాయకుడు ఆ ప్రశ్నకు హేళనగా నవ్వబోయినవాడల్లా, నరవానరాన్నీ, ఏనుగు జలగ్రహాన్నీ చూసి కొంచెం బెదురుకుని, "నే నెవరినో, ఇంతకుముందే, నే చేసిన హెచ్చరికవల్ల నీకు అర్థమైవుండాలి?" అన్నాడు.

"ఆ హెచ్చరికేదో నేను సరిగా వినలేదు. నేను, నా శత్రువైన యీ సరోవరం పక్షిని పారిపోకుండా చూసే ప్రయత్నంలో వున్నాను. ఇప్పుడు మరోసారి అడుగుతున్నాను. ఈ గుర్రాలనో, కంచర గాడిదలనో ఎక్కి, మా మధ్యకు వచ్చిన నువ్వెవరివి?" అన్నాడు సిద్ధసాధకుడు.

అనుచరులైన అశ్వికులను ముందుకు రావలసిందిగా హెచ్చరించాడు.

అశ్వికులు కత్తులెత్తి పట్టుకుని తనను సమీపించేంతలో సిద్ధసాధకుడు చుట్టూ ఓ మారు కలయచూసి, వీరసేనుడితో, "మన చుట్టూ కొన్నాళ్ళుగా తిండిలేక ఆకలితో నకనకలాడుతున్న నరభక్షకులున్నారు. కావాలంటే క్షణాల మీద నిన్నూ, నీతోటి అశ్వికులనూ కాలరాయగలను. కాని, అందువల్ల నరభక్షకులకు తప్ప మరెవరికీ మేలు కలగదు," అన్నాడు.



"మేలూ, కీడుల సంగతి నాకనవసరం. ఇక్కడికి దాపులనే కనకాక్షరాజుగారు విడిసి వున్నారు. అందరూ అక్కడికి రండి," అన్నాడు వీరసేనుడు.

సాధకుడు కళ్ళెర్రచేసి, వీరసేనుడి కేసి చూస్తూ," ఇది ఆజ్ఞా? విన్నపమా? నేనీ భూప్రపంచంలో ఒక్క మహాకాళుడి ఆజ్ఞతప్ప,మరెవరి ఆజ్ఞలనూ పాటించను," అన్నాడు.

తన యజమాని కొత్తగా వచ్చిన అశ్వికులపై కోపగించి వున్నాడని గ్రహించిన జలవృకరాక్షసుడు, రాతి గదను భుజం మీద పెట్టుకుని, గట్టిగా ఒకసారి నేలను కాళ్ళతోతాటించి, పెద్దగా హుంకరించాడు. నరవానరం జబ్బలు చరుస్తూ, అరణ్యం ప్రతిధ్వనించేలా బొబ్బరించింది. ఆ వికృతాకారాలనూ, అవి చేసే వికటాట్టహాసలనూ చూసి ఒక అశ్వికుడి గుర్రం బెదిరి, చప్పున వెనక కాళ్ళమీద నిలబడి, రౌతు కింద పడగానే దూరంగా పారిపోయింది.

ఇదంతా చూసి భయకంపితుడైపోయిన వీరసేనుడు, సిద్ధసాధకుడితో, "అయ్యా, మీరు కూడా నాలాగే హిరణ్యపుర పౌరులు. మహారాజుగారిని దర్శించేందుకు, ఎందుకు రాకూడదు?" అన్నాడు తలవంచి నమస్కరిస్తూ.

ఆ మాటలకు సిద్ధసాధకుడు పరమానంద పడిపోతూ, "అలా అన్నావ్,



వాళ్ళు అరణ్యాదేవర పంపిన ఆహారం! పట్టుకునేందుకు మా జాతివాళ్లు వాళ్ళ వెనకగా వెళ్ళారు,'' అన్నారు.

''వాళ్ళు పారిపోతున్న సంగతి నాకెందుకు చెప్పలేదు? వాళ్ళు ప్రాణాలతో దొరికేవరకూ మీ ఇద్దరూ మాకు బందీలు,'' అని సిద్ధసాధకుడు, జలవృకరాక్షసుడితో, ''జలవృక భటా! వీళ్లిద్దర్నీ పట్టుకుపోయి, ఒక గుర్రం మీదవేసి, తాళ్ళతో బిగించు,'' అన్నాడు.

జలవృక రాక్షసుడు మెరుపులాపోయి బెబ్బులిదొరనూ, ముసలిగణాచారినీ పట్టుకొని, ఒక గుర్రం మీదినుంచి రౌతు దిగేలోపలే వాణ్ణి మోచేతి దెబ్బతో దూరంగా పడేట్టు కొట్టి, వాళ్ళను దాని వీపుమీద బిగించి కట్టాడు.

ఆ పని ముగిసినాక సిద్ధసాధకుడు, వీరసేనుడితో, ''ఇక నువ్వు ముందుండి దారి తియ్యి, కనకాక్షరాజుగారి దర్శనం చేసుకుందాం,'' అని నరవానరాన్ని అదిలించి, తమ నాయకులను బంధించిన వాళ్ళను, ఏమి చేయటమా అని తమలో తాము తర్కించుకుంటున్న నరభక్షకులతో, ''ఒరే, మనుషుల్ని తినే, దుష్ట మానవుల్లారా! మీ వాళ్ళు వెతకబోయిన సరోవరంపక్షిగాడికి గాని వాడి బంటయిన మొసలిముఖం వాడికిగాని, మీరు

బావుంది! రాజుగారి దగ్గిరకు వస్తున్నాను పద. ఈ నరభక్షకుల్నీ, సరోవరం దుర్మార్గులిద్దర్నీకూడా, ఆయన దగ్గిరకు పట్టుకుపోవాలి,'' అని చుట్టూచూసి, మాయా సరోవరేశ్వరుడూ, మకరకేతుడూ కనబడక పోయేసరికి అదిరిపడి, ''ఏరీ, ఆ దుష్టులు? ఏమయారు?'' అన్నాడు.

ఆ వెంటనే నరభక్షకులంతా ఒక్కసారిగా పొట్టలు చెక్కలయేలా నవ్వారు. వాళ్ళనాయకుడు బెబ్బులిదొరా, ముసలి గణాచారీ ముందుకువచ్చి, సిద్ధ సాధకుడితో, ''నువ్వూ, యీ గుర్రాల వాళ్ళూ తగూలాడుతున్న అదను చూసి వాళ్ళిద్దరూ చల్లగా చెట్లల్లోకి పరిగెత్తారు.

ఏమాత్రం హానికలిగించినా, మీ నాయకుణ్ణీ గణాచారినీ ముందు నరవానరానికి మేతగా వేసి, తరవాత మిమ్మల్ని క్రూర మృగాల కింద వేటాడతాను.'' అన్నాడు శూలాన్ని ఝుళిపిస్తూ.

నరభక్షకులు నోరు మెదపలేదు. వాళ్లు ముఖాలు దీనంగాపెట్టి, తమ నాయకుడి కేసీ, గణాచారి కేసీ చూడసాగారు. ఇక వాళ్ళిద్దరూ గుర్రం మీద గిలగిల కొట్టు కుంటూ, ''అరణ్యదేవరో, మాకు యీ మనుషుల్ని ఆహారంగాపంపి, మా ప్రాణాల మీదికి తెచ్చావు. రక్షించు!'' అంటూ అరవసాగారు.



ఆశ్వికనాయకుడు తన అనుచరుల్ని రాజు కనకాక్షుడు విడిదిచేసిన ప్రాంతానికి బయలుదేరమన్నాడు. వాళ్ళకు వెనకగా నరవానరం మీద సిద్ధసాధకుడు కదిలాడు. అదే సమయంలో అరణ్యంలో మరొక ప్రాంతాన హంసల రథంలో పోతున్న జయశీలుడూ, అతడి మిత్రులకు హఠాత్తుగా ఒకచోట పులి చేత తరమబడుతున్న ఒక యువతి కనిపించింది. ఆమె పులికి దొరకకుండా చెట్లబోదెల చుట్టూ గిరికీలు కొడుతూ, మధ్య మధ్య అందుబాటులో వున్న చెట్టుకొమ్మలను పట్టుకుని, పైకి పోయి ప్రాణరక్షణ చేసుకునేందుకు ప్రయత్నిస్తున్నది.

హంసలరథంలో వుండి, కింది అరణ్యాన్ని పరీక్షగా చూస్తున్న వైద్య దేవుడని పిలవబడే దేవశర్మకు ముందుగా, యీ దృశ్యం కంటబడింది. అతడొక తృటికాలం భయాశ్చర్యాలతో కంపించి పోయి, పక్కనే వున్న జయశీలుణ్ణి భుజం పట్టుకులాగి, ''జయశీలా, పులి తరుముతున్న ఆ స్త్రీని చూశావా? ఆమే కాంచనమాల — మాయాసరోవరేశ్వరుడి బంట్లు అపహరించుకుపోయిన, కనకాక్ష రాజుగారి కుమార్తె! ఇప్పుడేం చేయటం?" అన్నాడు.

జయశీలుడు, దేవశర్మ చెప్పిన అరణ్య ప్రదేశాన్ని చూస్తూనే రథంలో లేచి




నిలబడి, రథాన్ని తోలుతున్న వాడితో, "ఒరే, రథాన్ని వెంటనే కిందికి దించు!" అన్నాడు.

అంగరక్షకుడు తలవంచి దిగువనున్న మహా వృక్షాలను చూసి, "అయ్యా, యిక్కడ రథాన్ని దింపటం సాధ్యపడదు. మరికొంచెం దూరం పోయి, చెట్టూ చేమా లేని ఆ కనబడే ఖాళీ ప్రదేశంలో రథాన్ని దించుతాను," అన్నాడు.

ఆ మాటలకు జయశీలుడు కోపంగా, "ఒరే, మతిమాలినవాడా! నువ్వు రథాన్ని అక్కడ దించే లోపల రాజకుమార్తె పులికి ఆహారం అయిపోతుంది. చప్పున రథాన్ని కాస్త కిందికి నడుపు, నేను ఏ చెట్టుకొమ్మల్లోనో దూకి, ఆమెను కాపాడేందుకు ప్రయత్నిస్తాను." అన్నాడు.

అంగరక్షకుడు హంసల మెడలకున్న తాళ్ళను కిందికి లాగాడు. అవి చెట్ల చిటారు కొమ్మల సమీపానికి రథాన్ని లాగినై. వెంటనే జయశీలుడు రథంలో నుంచి కిందికి దూకుతూనే, రెండు చేతులతో ఒక చెట్టుకొమ్మను వడిసి పట్టుకున్నాడు. కాని, అది అతడి బరువుకు ఫెళఫెళమంటూ విరిగి, నలభై, యాభై అడుగుల ఎత్తునుంచి, అతడితోపాటు కిందపడింది.

చెట్టుకొమ్మ నేలను తాకే లోపలే జయశీలుడు ఒడుపుగా ఒక పల్లటీకొట్టి, తాను వేగంగా నేలమీద పడి కాళ్ళూ, చేతులూ విరగగొట్టుకోకుండా, తనను తాను కాపాడుకున్నాడు. ఆ సమయంలో కాంచనమాలను వెంటబడి తరుముతున్న పులి, కొమ్మ విరిగిపడిన శబ్దానికి అదిరిపడి, వెనక్కు తిరిగి చూసింది. అది అవకాశంగా తీసుకుని కాంచనమాల దాపుల అందిన ఒక చెట్టుకొమ్మను పట్టుకుని, పైకి పాకసాగింది. కాని, పులి అంతలోనే పెద్దగా గాండ్రించి, ఆమె కేసి పరిగెత్తిపోయి, ఛెంగున పైకెగరబోయేంతలో, కత్తి దూసేందుకు కూడా వ్యవధిలేని జయశీలుడు ఒక్క

ఉరుకున పోయి, దాని వెనకకాళ్ళు రెండూ పట్టుకుని, గుంజి దూరంగా విసిరివేశాడు.



కాంచనమాల చెట్టుకొమ్మల్లో చేతులకు సరి అయిన పట్టు దొరకక, గాలికి ఊగు తున్న కొమ్మలతోపాటు అటూ ఇటూ ఊగుతూ, ''అయ్యా, సమయానికి వచ్చి నన్ను పులి బారినుంచి రక్షించారు, కృతజ్ఞురాలిని!'' అన్నది.

జయశీలుడు ఆమె సౌందర్యానికి అచ్చెరువు చెందాడు. తను ఎంతో కాలంగా ఎన్నో శ్రమలకోర్చి, ప్రాణాపాయ పరిస్థితుల నుంచి బయటపడి — ఎలాగైతేనేం కనకాక్షరాజుగారి కుమార్తె కాంచనమాలను రక్షించగలిగాడు. ఈమె అన్న అయిన కాంచనవర్మ ఏమయినట్టు?

''నీ పేరు కాంచనమాల! నువ్వే దేశపు రాజకుమార్తెవో కూడా నాకు తెలుసు. మీ అన్న కాంచనవర్మ ఎక్కడ? హంసల రథం మీదినుంచి కిందపడి, ఏ విధంగా ప్రాణాలు కాపాడుకో గలిగావు?'' అని అడిగాడు జయశీలుడు.

జయశీలుడు యిలా మాట్లాడుతున్న సమయంలో కాంచనమాల చెట్టుకొమ్మల లోంచి నేలమీదికి దిగి, అందగాడూ, ధైర్యశాలీ అయిన యీ యువకుడికి తన పేరు ఎలా తెలుసునా అని ఆశ్చర్య పోతూ, ''అయ్యా, నేను హంసల రథం మీదినుంచి, అదృష్టవశాత్తూ ఒక వాగు నీటిలో పడటం వల్ల, బతికిపోయాను. నాతోపాటు రథంలో వున్న సరోవరేశ్వరుడూ, ఆయన రథం తోలేవాడూ బహుశా యీ అరణ్యంలో ఎక్కడో, నాలాగే ప్రాణాలతోనే వుండి వుంటారు. ఇక నా సోదరుడైన కాంచనవర్మ; అతడు మాయాసరోవరంలోని భవనంలోనే వున్నాడు,'' అన్నది.

''మాయాసరోవరేశ్వరుణ్ణి గురించి నాకు కొంత తెలుసు. అతడి సేవకులైన సర్పనఖుడు, సర్పస్వరుడు అనే వాళ్ళే కాక, మరొక ముఖ్యుడు కూడా నాకు

పరిచయం అయాడు. మాయాసరోవరం నుంచి నీ అన్నను కూడా బంధవిముక్తుణ్ణి చెయ్యాలి. అక్కడికి వెళ్ళేమార్గం నీకు తెలిసే వుంటుంది. ముందు మనం యీ దాపులనే వున్న నా మిత్రుడైన సిద్ధ సాధకుణ్ణి కలుసుకోవాలి,'' అన్నాడు జయశీలుడు.

కాంచనమాల అతడితోపాటు కదల బోయేంతలో, అప్పటివరకూ జయశీలుడి దెబ్బకు నడుం విరిగి స్పృహకోల్పోయిన పెద్దపులి, చప్పున తల ఎత్తి కోరలు చాచి, పెద్దగా గాండ్రించి, వాళ్ళ కేసి దూకేందుకు లేచి నిలబడబోయి, దభీ మంటూ తిరిగి నేలమీద పడింది.

''ఎంత క్రూరమృగమైనా, గాయపడిన దాన్ని బాధలోవదిలి పోగూడదు. ఇప్పుడే దీని తల నరుకుతాను,'' అంటూ జయశీలుడు పులికేసి నడిచాడు.

''ఇదెంతటి భయంకరమైన పులి! మీరు రావటం కొంచెం ఆలశ్యం అయితే, నన్ను గొంతుకొరికి చంపి, తినివుండేది!" అంటూ కాంచనమాల, జయశీలుడి వెంట పులిని సమీపించింది.

అప్పటివరకూ పక్కనేవున్న గుబురు చెట్లచాటున జలగ్రహం మీద వుండి యిదంతా చూస్తున్న మాయాసరోవరే శ్వరుడు, తల తిప్పి, పక్కనే గుర్రం మీదవున్న మకరకేతుతో, ''ఈ జయశీలు డనేవాణ్ణి బంధించటానికి యిదే మంచి అవకాశం. తామరకాళ్ళ తాడును అతడి కంఠాని కేసి విసిరి, పట్టుకో,'' అన్నాడు.

''ప్రభూ, ఈ జయశీలుడు మహా సత్వుడు. అతడితో విరోధం మనకు క్షేమం కాదు,'' అంటూ మకరకేతు ఏడ్పుముఖం పెట్టాడు.

''ఛీ, పిరికిపందా!'' అంటూ మాయాసరోవరేశ్వరుడు, మకరకేతు నుంచి బలమైన తాడును గుంజుకుని, జలగ్రహంతో కొంచెం ముందుకు వచ్చి, తాటి ఉచ్చును గాలిలో రెండు మూడు సార్లు గిరగిరా తిప్పి, గురిగా జయశీలుడి కంఠం కేసి విసిరాడు. —(ఇంకావుంది)





# పిశాచయోగ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ ప్రయత్నం ఎన్నిసార్లు విఫల మైనా నువు విరమించకపోవటం చాలా ఆశ్చర్యంగా ఉన్నది. అదృష్టం అందల మెక్కించినా, ఆ అదృష్టానికి స్వస్తి చెప్పి, అడవులు పట్టి పోయే వాళ్లున్నారు. అందుకు నిదర్శనంగా నీకు ధనగుప్తుడి వింత కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను." అంటూ ఇలా చెప్పసాగాడు:

ధనగుప్తుడు ఒక వర్తకుడి కొడుకు. తండ్రి ఆస్తి అతనికి చాలా సంక్రమిం చింది. అయితే అతనికి భోగభాగ్యాలు రెంటిమీదా సమానంగా ప్రీతి. వర్తకంతో

## బేతాళ కథలు




భాగ్యం వస్తుంది గాని, భోగాలు అనుభవించటానికి ఎక్కువ వ్యవధి ఉండదు. అంతకన్న జూదంలో డబ్బు సంపాదించడం ఉభయతారకంగా ఉంటుందని భ్రమపడి, ధనగుప్తుడు జూదం ప్రారంభించి, అప్పుడప్పుడూ గెలవటం చేత మరింత ఉత్సాహంతో భారీఎత్తున జూదంలోకి దిగి, అకస్మాత్తుగా ఉన్నదంతా పోగొట్టుకుని, క్షణంలో బికారిగా మిగిలిపోయాడు.

ఆ దెబ్బతో ధనగుప్తుడికి జీవితం మీద రోత పుట్టింది. అందుచేత అతను క్రూరమృగాలను కూడా లక్ష్యపెట్టకుండా అరణ్యంలో నివాసం ఏర్పాటు చేసుకున్నాడు. త్వరలోనే అతను, జుట్టు జడలు కట్టి, గడ్డాలూ, మీసాలూ పెరిగి పిచ్చివాడిలాగా తయారయాడు.

అరణ్యంలో ధనగుప్తుడు ఉంటున్న ప్రాంతానికి కొంత దూరంలో ఒక కోయ గూడెం ఉన్నది. ఆ ప్రాంతాల ఆ యేడు వర్షం పడకపోవటంతో కోయలు తమ అవసరాల కోసం అరణ్యంలో దూర ప్రాంతాలకు కూడా తిరగవలసి వచ్చింది.

ఆ విధంగా వాళ్లు ధనగుప్తుణ్ణి చూడటం తటస్థించింది. గడ్డాలూ, మీసాలూ పెరిగి, ఏ ఆయుధమూ లేకుండా, ఒంటరిగా క్రూరమృగాలు సంచరించే అరణ్యంలో ఉంటున్న ధనగుప్తుడు మహా శక్తిసంపన్నుడు అయి ఉండాలనుకుని, కోయలు అతనికి పళ్లూ, తేనే మొదలైనవి ఇచ్చి, కాళ్లమీదపడ్డారు.

"ఏం కావాలి మీకు?" అని ధనగుప్తుడు కోయలను అడిగాడు.

"మీరు వచ్చి మా గూడెంలో ఉంటే మిమ్మల్ని కనిపెట్టి ఉంటాం. మాకూ కలిసి వస్తుంది," అన్నారు కోయలు.

మారు మాటాడకుండా ధనగుప్తుడు లేచి కోయల వెంట వాళ్ల గూడానికి వెళ్లాడు. అతను గూడెంలో అడుగు పెట్టుతూండగానే వర్షం ఆరంభమై, కుంభవృష్టి కురిసింది.

కోయలకు ధనగుప్తుడి మహత్యంలో పూర్తిగా గురి ఏర్పడింది. అది మొదలు కోయల జీవితం మూడు పువ్వులూ, ఆరు కాయలూ అయింది. దానికి ముఖ్య కారణం వర్షంపడటమే అయినా, కోయలు ధనగుప్తుడి మహిమవల్లనే ఇది జరిగిం దనుకున్నారు.

ఈ సమయంలో ఆ దేశపు రాజు, కోయలు ఇటీవల మరీ విజృంభించు తున్నట్టు విని, వారిని శిక్షించటానికి సేనను పంపాడు. తమకు అండగా ఒక మహాత్ముడున్నాడన్న ధైర్యంతో కోయలు సాహసంతో పోరాడి, సుశిక్షితులైన రాజు గారి సైన్యాన్ని చుట్టుముట్టి, చావ చితక గొట్టేశారు.

రాజు ఆశ్చర్యపడి, కోయల కింత పౌరుషమూ, బలమూ రావటానికి కారణం ఏమిటో తెలుసుకు రమ్మని చారులను పంపాడు. వాళ్లు వచ్చి చూసే సరికి, కోయలు ధనగుప్తుణ్ణి పూజించి, అతని చుట్టూ నృత్యం చేస్తూ పాటలు పాడుతున్నారు.

చారులు ఈ మాట చెప్పగానే రాజు కూడా ధనగుప్తుడి మహత్తు నమ్మి, అలాటి వాడివల్ల కోయలకు లాభించటం కన్న తనకు లాభించటం ఉచితంగా ఉంటుందనుకుని, అతనికి రహస్యంగా ఆహ్వానం పంపాడు.

కోయల ప్రాపకమే ఎంతో ఆనంద దాయకంగా ఉన్నప్పుడు రాజుగారి





ప్రాపకం ఇంకా బాగుంటుందన్న నమ్మకంతో ధనగుప్తుడు కోయలకు తెలియకుండా, ఒక అర్ధరాత్రి సమయంలో అరణ్యం నుంచి బయటపడి, రాచనగరు చేరుకున్నాడు.

రాజు అతనికి ఎంతో మర్యాదలు చూపి, అతని పేరు అడిగాడు.

''అనుభవానందస్వామి,'' అని ధనగుప్తుడు చెప్పాడు.

అదేం చిత్రమో అనుభవానందస్వామి రాజభవనంలో అడుగు పెట్టగానే, చాలా కాలంగా రాజును బాధిస్తూ వచ్చిన కీళ్ల వాతం తిరుగుముఖం పట్టి, త్వరలోనే పూర్తిగా నయమయింది. రాజు వైద్యులను ప్రశంసించినా, తన మనసులో అనుభవానందస్వామి మహిమవల్లనే తన రోగం నయమయిందని నమ్మాడు.

రాజుగారు అనుభవానంద స్వామికి మంచి ఆశ్రమం నిర్మించి, అన్ని సదుపాయాలూ చేశాడు. రాజుగారితో బాటు దివాణంలో ఉన్న ముఖ్యులందరూ ఈ స్వామీజీ భక్తులుగా తయారయారు. స్వామి చాలా కొద్దిగా మాట్లాడేవాడు. కాకతాళీయంగా అతని నోటిమాటలు చాలా వరకు నిజమయేవి. అతని వాక్శుద్ధి మీద అందరికీ గురికుదిరింది.

ఇలా ఉండగా ఒకరోజు రాజు అతని వద్దకు వచ్చి, తాను పొరుగుదేశం మీద దండయాత్రకు పోతున్నాననీ, తనకు యుద్ధంలో విజయం కలిగేటట్టు ఆశీర్వదించమనీ కోరాడు. రాజు దండయాత్రకు పోతున్నది ధనగుప్తుడి స్వదేశం మీదికే అయినా ''విజయోస్తు!'' అని రాజును అతను తప్పనిసరిగా దీవించవలసి వచ్చింది. అదీగాక తన దేశం ఈ రాజు మీద గెలిచే అవకాశం లేదని కూడా అతనికి తెలుసు.

అతను అనుకున్నట్టే రాజు యుద్ధంలో గెలిచి తిరిగి వచ్చాడు. అతను అనుభవానందస్వామికి పెద్ద ఎత్తున పూజలూ, సన్మానాలూ చేద్దామనుకున్నాడు. కాని

ఆయన తీరా వెళ్ళిచూస్తే ఆశ్రమం ఖాళీగా ఉంది.

అనుభవానందస్వామి జాడ ఎవరికీ తెలియరాలేదు. స్వామీజీగా అతన్ని మళ్ళీ చూసినవారు లేరు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, కోయల కంటపడి నప్పటినుండీ ధన గుప్తుడి దశ మారిపోయింది. అతనికి జీవితం మీద కలిగిన విరక్తి కూడా తగ్గి పోయి, జీవితంలో ఆనందం కలిగినట్టు కనబడుతుంది. అలాటివాడు తాను ఉచ్ఛదశకు చేరుకుంటున్న సమయంలో మళ్ళీ జీవితానికి ఎందుకు దూర మయాడు? తన ఆశీర్వచన ప్రభావం చేత తన స్వదేశానికి యుద్ధంలో అపజయం కలిగిందనా? లేక తన దేశాన్ని జయించిన వాడిచేత గౌరవం పొందడం ఇష్టంలేకనా? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "తన దేశం యుద్ధంలో గెలిచే అవకాశం లేదని ధన గుప్తుడికి ముందే తెలుసును. తన వాక్శుద్ధిలో అతనికి ఏమాత్రం నమ్మకం ఉన్నా అతను రాజును గెలవమని దీవించడు. తన వద్ద ఏమాత్రం మహిమ ఉన్నా జూదంలో అంతగా ఓడిపోయి, బికారి అయి ఉండడు. అయితే తన వాక్ప్రభావం వల్లనే తన దేశం శత్రువుల పాలయిందన్న అపకీర్తి మొయ్యటం అత నికి బాధగా ఉండవచ్చు. మరొక ప్రమాదం ఏమంటే తనకు ఏ శక్తీ లేదని ఏ క్షణాన అయినా బయటపడవచ్చు. ఈ స్వామీజీ జీవితం అతను కోరి తెచ్చుకున్నది కూడా కాదు. ఇన్ని కారణాలను బట్టి అతను ఆ జీవితానికి ఉద్వాసన చెప్పేశాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాలుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# వర్తకుడి తెలివి

ఒక నగరంలో ఒక వర్తకుడి ఇంట దొంగతనం జరిగి, ఇరవై వేల వరహాల సొత్తు పోయింది. అసలే అతను పరమ పిసినారి. ఇంతనష్టం వచ్చేసరికి అతని గుండె ఆగినంత పని అయింది. అతను రాజుగారికి ఫిర్యాదు చేశాడు గాని, రోజులు గడిచేకొద్దీ మనోవ్యాధి పాలయాడు. అతని దురదృష్టం కొద్దీ దొంగలు ఎంతకూ పట్టుబడలేదు.

చివరకు అతను ప్రతిరోజూ నగరంలో ఉన్న గుళ్ళకు అన్నిటికి వెళ్ళి, అందులో ఉన్న దేవుళ్ళతో, "దేవా, శ్రావణ పౌర్ణమినాటికి పోయిన నా సొమ్ము దొరికిందంటే, అదే రోజున నీకు పదివేల వరహాలు కానుకగా ఇచ్చుకుంటాను," అని గట్టిగా అనసాగాడు.

పది దేవాలయాలలోనూ ఇలాగే అంటుంటే ఆ మనిషికి పిచ్చేమో అనుకున్నారు. ఎందుకంటే పోయినది ఇరవై వేలే.

ఇంతలో రాజభటుల తెలివివల్ల అయితేనేం, వర్తకుడి అదృష్టం వల్ల అయితేనేం దొంగలు దొరికారు, సొమ్మూ దొరికింది.

శ్రావణ పౌర్ణమి వచ్చింది. వర్తకుడు ఏ గుడిలోనూ మొక్కుబడి చెల్లించలేదు. అర్చకులంతా చేరి అతన్ని అడిగారు.

"మొక్కు ఈ క్షణాన చెల్లిస్తాను. కాని, ఏ దేవుడి దయవల్ల సొమ్ము దొరికినదీ తెలియటంలేదు," అన్నాడు వర్తకుడు.

—బెళదోణ శోభ.





# కలుపుకూలి

సిరిపురం గ్రామంలో ధర్మయ్య అనేవాడు తనకున్న రెండెకరాల చెక్కని స్వయంగా దున్నుకుని, తన కుటుంబానికి కావలిసిన గింజలు పండించుకునేవాడు. ఉన్నంతలో అతను ఒకరికి సహాయం చేసేవాడుగాని, ఎవరినీ చెయ్యిచాచి అడిగి ఎరగడు.

ధర్మయ్య పొరుగున ఉన్న భద్రయ్యకు బంగారం పండే మాగాణి పాతిక ఎకరాలున్నా, ఆ రాబడితో తృప్తిపడక వడ్డీ వ్యాపారం చేస్తూండేవాడు. ఈ వ్యాపారంతో అతను చాలా మందిని పీల్చి పిప్పి చెయ్యటం వల్ల, విధిలేక అతని వద్ద అప్పు చేసిన వాళ్లు అతన్ని పులిని చూసినట్టు చూసేవారు.

గ్రామాధికారి భద్రయ్య మనిషి, అతని చేతి కీలుబొమ్మ. అతన్ని అడ్డంపెట్టుకుని భద్రయ్య మకుటంలేని మహారాజుగా ఏలుతున్నాడు సిరిపురంలో. బీద ప్రజలు, తమకు అన్యాయం జరిగినా, చేసేదిలేక మౌనంగా భరించేవాళ్లు.

తనకన్న ధర్మయ్యకు ఊళ్ళో ఎక్కువ గౌరవమూ, మంచి పేరూ ఉండటం చూసి భద్రయ్యకు చాలా మంటగా ఉండేది.

ఇలా ఉండగా ఒక రోజు భద్రయ్య గొడ్లు ధర్మయ్య పొలంలో పడి, అతని పంటచేను నాశనం చేశాయి. చేతికి అందనున్న పంట నాశనం అయేసరికి ధర్మయ్య కంట నీరు పెట్టుకున్నాడు. గ్రామాధికారికి చెప్పుకుని లాభం లేదని అతనికి తెలుసు. అందుచేత అతను కిమ్మనకుండా ఊరుకున్నాడు.

కాని భద్రయ్య అతన్ని అంతతో వదిలిపెట్టక, ధర్మయ్య తన గొడ్లను చావబాదాడని గ్రామాధికారి దగ్గిర ఫిర్యాదుచేశాడు. గ్రామాధికారి భద్రయ్య దగ్గిర లంచం మేసి, ధర్మయ్యను కచేరికి పిలిపించాడు.

బొమ్మిడి అచ్చారావు



ధర్మయ్య వెళ్ళేసరికి గ్రామాధికారి దగ్గిర అతని అనుయాయులతో బాటు భద్రయ్య కూడా ఉన్నాడు, మీసం మెలేస్తూ.

''ధర్మయ్యా, నువు భద్రయ్య గొడ్లను చావగొట్టావట. దానికి నీ సంజాయిషీ ఏమిటి ?'' అని గ్రామాధికారి అడిగాడు.

భద్రయ్య నివ్వెరపోయాడు. పంట నష్టపోయినతానుఫిర్యాదు చేయవలిసింది పోయి, తనమీదే ఫిర్యాదా ?

''అసలు జరిగిన విషయం ఇది. భద్రయ్యగారి గొడ్లు నా పంట పొలంమీద పడి నాశనం చేశాయి. గొడ్లను బయటికి తరిమానే తప్ప వాటి ఒంటిమీద చిన్న దెబ్బ కూడా వెయ్యలేదు. నష్టపడిన నా మీద ఇలా ఆరోపణ చెయ్యటం ధర్మం కాదు, బాబూ,'' అన్నాడు ధర్మయ్య.

''నాకే ధర్మపన్నాలు చెబుతున్నావా? మేంతలుచుకుంటే ఈ సిరిపురంలో నీకు పిడికెడు బియ్యం పుట్టవు! నిన్నడిగి నేను న్యాయవిచారణ చేస్తాననుకున్నావా ? నా తీర్పు విను. భద్రయ్య గొడ్లను చావగొట్టి నందుకు వందరూపాయలు అతనికి నష్ట పరిహారంగా ఇచ్చుకో. అతని గొడ్లు నీ పొలంలో కలుపుతీసినందుకు వాటి కూలి మరో యాభైరూపాయలు ! మొత్తం నూట యాభైఇచ్చుకో,'' అన్నాడు గ్రామాధికారి.

ధర్మయ్యకు మతి పోయినట్టయింది.

''గొడ్లు కలుపు తీయట మేమిటి, బాబూ ?'' అని అతను అడిగాడు.

''భద్రయ్య గొడ్లు నీపొలంలో కలుపు మొక్కలు మాత్రమే మేశాయి. నువు వేరే మనుషులను పెట్టి కలుపు తీయించ నవసరంలేదు. వాళ్ళ కిచ్చేది భద్రయ్య గొడ్లకే రావాలి,'' అన్నాడు గ్రామాధికారి.

''గొడ్డుకు పంటమొక్క ఏదో, కలుపు మొక్క ఏదో, తెలుస్తుందా? ఇదెక్కడి న్యాయం, బాబూ?'' అన్నాడు ధర్మయ్య.

గ్రామాధికారి కళ్ళెర్రచేసి, ''నా తీర్పుకు ఎదురుచెప్పావు గనక న్యాయ స్థానానికి యాభైరూపాయలు జరిమానా కట్టు. రేపుసాయంత్రంలోగా రెండువందల రూపాయలు కట్టకపోతే నీకు దండన విధించవలిసి ఉంటుంది,'' అన్నాడు.

ధర్మయ్య గుడ్ల నీరు కుక్కుకుంటూ అక్కడినుంచి బయలుదేరి, తన ఇంటికి నాలుగిళ్లు అవతల ఉన్న రామయ్య వద్దకు వెళ్ళి, జరిగినదంతా చెప్పుకుని మొర పెట్టుకున్నాడు.

రామయ్య కూడా ధర్మయ్యలాగే సజ్జనుడు. ఇద్దరూ మంచి స్నేహితులు. ధర్మయ్య చెప్పినదంతా విని రామయ్య చాలా బాధపడి, ''నీకు చాలా అన్యాయం జరిగింది, ధర్మన్నా. సరే, వీళ్లకు తగిన బుద్ధి చెబుదాం. ముందు ఈ రెండు వందలు పట్టుకెళ్లి, వాళ్ల మొహాన కొట్టిరా. ఇంత కింత వాళ్ళనుంచి ఎలా రాబట్టాలో నేను చూసుకుంటాను," అని డబ్బిచ్చి ధర్మయ్యను పంపేశాడు.

ఆ మర్నాడు రామయ్య తన గొడ్లను తీసుకెళ్లి, గ్రామాధికారి పంట పొలంలో శుభ్రంగా మేపాడు. గ్రామాధికారి కమత గాళ్లు ఇది చూసి, పరుగున వెళ్లి గ్రామాధికారికి చెప్పారు. అతను హుటాహుటివచ్చి చూసేసరికి, రామయ్య తన గొడ్లకు తాపీగా నీరు పట్టిస్తూ కనిపించాడు.

''రామయ్యా, నువు నా పొలంలో నీ గొడ్లను మేపావని తెలిసింది. ఏమిటి నీ సంజాయిషీ!'' అని గ్రామాధికారి అడిగాడు.

"మీ పొలంలో గొడ్లను మేపానా?



ఎవరో కిట్టనివాళ్లు చెప్పి ఉంటారు,'' అన్నాడు రామయ్య.

''నా మనుషులు చూసి చెప్పారు. నువు చేసిన పనికి నష్టపరిహారం ఇచ్చుకోవలసి ఉంటుంది,'' అన్నాడు గ్రామాధికారి.

''మీకు చేతనైంది చేసుకోండి," అన్నాడు రామయ్య.

''సరే, నీ విషయం న్యాయస్థానంలో తేలుస్తాను,'' అంటూ గ్రామాధికారి బస్తీకి పోయి, రామయ్య తన పది ఎకరాల పంట పొలం నాశనం చేశాడనీ, తనకు నష్ట పరిహారం ఇప్పించాలనీ న్యాయాధికారిని కోరాడు.

మర్నాడు న్యాయస్థానానికి హాజరు

కావలసిందని రామయ్యకు కబురు వెళ్లింది. మర్నాడు రామయ్య ధర్మయ్యను వెంటబెట్టుకుని న్యాయ స్థానానికి వెళ్లాడు.

న్యాయాధికారి రామయ్యను, ''నువ్వు గ్రామాధికారి పొలంలో గొర్లను మేపి నష్టం కలిగించావట, నీ మీద ఫిర్యాదు వచ్చింది. నీ సంజాయిషీ ఏమిటి ?" అని అడిగాడు.

''తమరు న్యాయమూర్తులు. తమతో ఉన్న మాట చెబుతాను. నేను గ్రామాధి కారి పొలంలో గొర్లను మేపిన మాట నిజమేగాని, నా గొర్లు కలుపు మొక్కలు మాత్రమే మేశాయి. మిగతా పంటకు ఏమీ నష్టం కలిగించలేదు. తమరు నాకు కలుపు కూలి ఇప్పించాలి,'' అన్నాడు రామయ్య.

సభలోని వారంతా గొల్లున నవ్వారు.

రామయ్య చెప్పిన మాటలో ఏదో గూఢార్థం ఉన్నదని తోచి న్యాయాధికారి, ''కలుపుకూలి ఏమిటి, రామయ్యా ?'' అని అడిగాడు.

''ప్రభువులు న్యాయం చిత్తగించాలి. లోగడ భద్రయ్యగారి గొర్లుధర్మయ్యగారి రెండెకరాల పొలంలో కలుపు తీసి నందుకు గ్రామాధికారిగారు యాభై రూపాయలు ఇప్పించారు. రెండెకరాలకే యాభైవస్తే గ్రామాధికారిగారి పదెకరా లకు ఇంకా ఎక్కువ వస్తుంది గదా అని వారి పొలంలో నా గొర్లచేత పని చేయించాను, బాబూ. న్యాయంగా నా గొర్లకు కలుపు కూలి దక్కాలి గదా! వాటి యజమానిని గనక ఆ డబ్బు నాకు ఇప్పించమని తమర్ని ప్రార్థిస్తున్నాను," అన్నాడు రామయ్య చేతులు కట్టుకుని.

న్యాయాధికారి జరిగిన మోసం గ్రహించాడు. ఆయన ధర్మయ్య నుంచి జరిగిన సంగతి తెలుసుకుని, ధర్మయ్యకు రెండు వందలతో బాటు కొంత పరిహారం కూడా భద్రయ్యచేత ఇప్పించి, గ్రామాధి కారిని పదవి నుంచి తొలగించి, ఆ స్థానంలో రామయ్యను నియమించాడు.



# దురాశ

ఒక ఊళ్ళో రామశాస్త్రి అనే పౌరోహిత్యపు బ్రాహ్మణ పండితుడు ఉండేవాడు. పౌరోహిత్యం మీద రాబడి తక్కువ. తన పాండిత్యం మీద లక్షలు గడించి, ఖ్యాతి సంపాదించుకోవాలని రామశాస్త్రి ఆశ.

ఇంతలో ఆ దేశపు రాజు రుద్రయాగం తలపెట్టి, దేశంలోని ప్రతి గ్రామంలోనూ గల బ్రాహ్మణ పండితులందరికీ ఆహ్వానాలు పంపాడు. ఆహ్వానం అందగానే రామశాస్త్రి తన కలలు పండుతున్నాయనుకున్నాడు. రాజుగారి సమక్షంలో తన పాండిత్యం చూపి, ఆస్థాన విద్వాంసుడుగా అక్కడే ఉండిపోవచ్చు.

ఆ ఉద్దేశంతో అతను ఊళ్ళో పౌరోహిత్యాలు వదిలేసుకుని, ఉన్న ఇల్లు అమ్మేసి, రుద్రయాగం ప్రారంభం కావటానికి ఎదురు చూడసాగాడు. ఊళ్ళోవాళ్ళు ఇంకో పౌరోహిత్యపు బ్రాహ్మణ్ణి తెచ్చిపెట్టుకున్నారు.

ఇంతలో రాజుగారి అనారోగ్యం కారణంగా రుద్రయాగం ఆ యేటికి వాయిదా పడింది. రెంటికి చెడ్డ రేవడిలాగా రామశాస్త్రి ఇంకో ఊళ్ళో పౌరోహిత్యం చేసుకోవటానికి వెళ్ళిపోయాడు.

—"శారద"





# సాధు సాంగత్యం

వల్లభుడు చురుకైనవాడే గాని వాడికి నా అన్నవాళ్లు ఎవరూ లేరు. బతికే ఆధారం కూడా ఏమీలేదు. కొంత కాలం దారిద్ర్యంతో బాధపడి, వాడు మోసంచేసి అయినా డబ్బు సంపాదించి, సుఖంగా బతకాలని నిశ్చయించాడు.

ఆ సమయంలో వాడి ఊరికి దివ్యానందుడు అనే సాధువు వచ్చాడు. ఊళ్లోని పెద్దలూ, ధనికులూ ఆయనకు చక్కని సౌకర్యాలు కలిగించారు. ఆయన రోజూ తనను చూడవచ్చేవారికి చక్కని బోధలు చేసేవాడు. ఊళ్ళోవాళ్లు ఆయనకు బంగారం దగ్గిరనుంచీ కానుకలు అర్పించేవాళ్లు.

ఇది చూసిన వల్లభుడు, "అన్నీ వదులుకున్న ఈ సాధువుకు ఈ బంగారమూ, డబ్బూ దేనికి? ఎలాగైనా నేను దాన్ని కాజెయ్యాలి," అనుకున్నాడు.

వాడు రోజూ సాధువును చూడబోతూ, పరిస్థితులన్నీ తెలుసుకుని, ఒకరోజు అర్ధరాత్రి సాధువు ఉండే బసలో ప్రవేశించి, ఆయనకు వచ్చిన కానుకలన్నీ సంగ్రహించి మూటకట్టాడు.

ఆ సమయంలో ఏదో చిన్న అలికిడి అయి, దివ్యానందుడు మేలుకుని, కళ్లు తెరిచి వల్లభుణ్ణి చూశాడు. వల్లభుడు కత్తి చూపి, సాధువును బెదిరించాడు.

దివ్యానందుడు నవ్వి, "అది తీసుకుపోయి ఏం చేసుకుంటావు, నాయనా?" అని అడిగాడు.

వల్లభుడు క్షణంపాటు బిత్తరపోయి, "ఈ సంపద మీకు అనవసరం. దీంతో నేను గొప్పగా బతుకుతాను," అన్నాడు.

"అయితే నువు గొప్పగా బతకటానికి ఈ సంపద చాలా? ఇంకా కావాలా?" అని సాధువు అడిగాడు.

జంధ్యాల లలిత

వల్లభుడు ఆశ్చర్యపోయి, "ఇంకా ఉంటే కావాలి," అన్నాడు.

"అయితే నువు నా వెంట కొంత కాలం ఉండి, ప్రజలు నాకు సమర్పించే కానుకలు నీకు చాలు ననిపించినప్పుడు, వాటిని తీసుకుపోయి సుఖపడు," అన్నాడు సాధువు.

వల్లభుడు సరేనన్నాడు. ఆ రోజు మొదలు వాడు సాధువు వెంటనే ఉంటూ ఆయన ఏ ఊరు వెళితే తాను కూడా వెళుతూ, ఆయన ప్రజలకు చేసే బోధలు వింటూ, ఆయనకు వచ్చే కానుకలు భద్రపరుస్తూ వచ్చాడు.

కొంత కాలం గడిచినాక సాధువు వల్లభుడితో, "కొద్దిరోజుల పాటు నేను సమాధిలోకి పోతున్నాను. నేను అందులో నుంచి బయటికి వచ్చేదాకా, నా స్థానంలో నువు ఉండి, చూడవచ్చినవారికి జ్ఞాన బోధలు చెయ్యి. నేను చేసే బోధలు నువూ వింటున్నావు గదా? ఎవరైనా సందేహాలు అడిగితే నీకు చాతనైన విధంగా తీర్చు," అని సమాధిలోకి వెళ్లి పోయాడు.

తరవాత వల్లభుడు సాధువు స్థానంలో ప్రజలకు బోధలు చెయ్యటమూ, వాళ్ళ సందేహాలు తీర్చటమూ మొదలుపెట్టి, తన ప్రసంగాలతో ప్రజలు తృప్తిపడటం గమనించాడు.

ఒకనాడు ఒక గజదొంగ వల్లభుడిని చూడవచ్చి, "స్వామీ, ఎన్నో దోపిడీలూ,



హత్యలూ చేశాను. కాని నా పాపాలు నన్ను వెన్నంటి వస్తున్నమాట తెలుసుకో లేకపోయాను. అమాయకులైన నా భార్యా, పిల్లలూ, బంధువులూ రాజ భటుల చేతిలో చిత్రహింసలు పడి, ప్రాణాలు పోగొట్టుకున్నారు. దానికి కారణమైన ఈ పాపిష్ఠి డబ్బు తమరు స్వీకరించి, పేదసాదలకు పంచి పెట్టండి," అని వల్లభుడి ముందు బోలె డంత ధనం ఉంచి వెళ్ళిపోయాడు.

మరోరోజు ఒక ప్రముఖ వర్తకుడు వల్లభుడి వద్దకు వచ్చి, "స్వామీ, వ్యాపారంలో ఎన్నో మోసాలూ, అక్రమాలూ చేసి, బోలెడంత డబ్బు పోగుచేశాను. కాని నా జన్మకు సుఖం లేకుండా పోయింది. నా భార్యా, పిల్లలూ ఏవో వింత రోగాలతో తీసుకుని చనిపోతుంటే, నా డబ్బు వారిని కాపాడలేకపోయింది. ఈ పాపిష్ఠి డబ్బు ప్రజలకు పంచిపెట్టి, నాకు మనశ్శాంతి కలిగించండి," అన్నాడు.

ఇలా తరచుగా తన వద్దకు పాపాలు చేసినవాళ్లు వచ్చి, తమ పశ్చాత్తాపం వెలిబుచ్చుతోంటే వల్లభుడి మనస్సు వికలమయింది. తాను కలలుగన్న గొప్ప బతుకుమీద వాడికి విరక్తి కలిగింది.

తరవాత దివ్యానందుడు సమాధి చాలించాడు. ఆయన వల్లభుడితో, "నాయనా, నీకు కావలిసినంత ధనం ప్రజల కానుకల రూపంలో వచ్చిందా?" అని అడిగాడు.

వల్లభుడు ఆయన కాళ్ళమీద పడి, "స్వామీ, ఈ తుచ్ఛమైన డబ్బు నాకు వద్దు. దీనివల్ల సుఖం లేదు. నన్ను అనుగ్రహించి, మీ వెంటనే ఉండ నియ్యండి," అన్నాడు.

తరవాత వల్లభుడు ఆయన జీవితాంతం వరకూ దివ్యానందుడి వెంటనే ఉండి, ఆయన అనంతరం ఆయన స్థానాన్ని తాను స్వీకరించి, ప్రజలు సమర్పించే కానుకలను ప్రజలకోసమే వినియోగిస్తూ జీవించాడు.



# లంచం అంటే

గణపతికి రాజుగారి దివాణంలో రెండు చేతులా అర్జించటానికి వీలైన ఉద్యోగం. అది గ్రహించి ఒక సంపన్నుడు అతనికి తన కూతురునిచ్చి ఘనంగా పెళ్ళిచేసి, అంతులేని కట్నాలూ, కానుకలూ ఇచ్చాడు.

అయితే గణపతి భార్య శ్యామల కాపురానికి వస్తూనే తన భర్త లంచాలు పట్టడని తెలుసుకున్నది. ఆమె ఎంత పోరినా ప్రయోజనం లేకపోయింది. చివరకు ప్రాణం విసిగి ఆమె తన పుట్టింటికి ప్రయాణమయింది.

గణపతి ఆమెతో, "నేను లంచాలు పట్టితే నాతో కాపరం చేస్తావా?" అన్నాడు.

చేస్తానన్నది శ్యామల.

"అయితే నువు మీ పుట్టింటి నుంచి వచ్చేటప్పుడు మీ నాన్న తినే బంగారు కంచం తీసుకురా!" అన్నాడు గణపతి.

"ఎందుకు? నేను తెచ్చిన సారె చాల్లేదా? అయినా వాళ్ళు ఎందుకిస్తారు? ఇయ్యరు!" అన్నది శ్యామల.

"అయితే దొంగిలించుకురా!" అన్నాడు గణపతి.

"నా తండ్రి సొత్తు నేను దొంగిలించనా! మీకు మతిపోయిందా?" అన్నది శ్యామల.

"లంచం పట్టటమంటే నాకూ అలాటిదే. రాజు నా తండ్రిలాటివాడు. ఆయనకు తెలియకుండా లంచం పట్టటం దొంగతనం," అన్నాడు గణపతి.

శ్యామల ప్రయాణం మానుకున్నది.

—లక్ష్మిజోగి.





# దేవుడి సొత్తు

దిక్కులేని శివాచారి వాళ్లకాళ్లూ, వీళ్ల కాళ్లూ పట్టుకుని, కొండమీది గుడికి పూజారి అయాడు. కాని ఆ ఉద్యోగంతో అతని దరిద్రం తీరలేదు. గుడికి వచ్చే భక్తులు తాము దేవుడికి అర్పించ దలచు కున్నది భూగర్భ హుండీలో వేసేవాళ్లు. పూజారికి నెలజీతం తప్ప ఏమీ దక్కేది కాదు.

కొండమీది గుడి హుండీలో అంత డబ్బు మూలుగుతూ ఉంటే తాను డబ్బు కోసం కటకటలాడటం శివాచారికి నచ్చ లేదు. ఒకరోజు రాత్రి అతను కొన్ని అవసరమైన పనిముట్లు తీసుకుని కొండ మీదికి వెళ్ళి, హుండీ తాళం ఉపా యంగా తీసి, లోపల మెరుస్తున్న నగలూ, నాణాలూ చూసి, అందులో ముఖ్యమైన వాటిని మూట గట్టి, మళ్ళీ తాళంవేసి, కొండ దిగివచ్చి, తాను తెచ్చిన దేవుడి సొమ్ము తన పెరట్లో ఒక చోట గుర్తుగా పాతిపెట్టి, మతిమరుపు కలవాడు కావటంచేత, సొమ్ము పాతిన చోటు వివరాలు ఒక కాగితంమీద రాసి, ఆ కాగితాన్ని తన ఇంట్లో గూట్లో శివుడి బొమ్మకింద దాచిపెట్టాడు.

ఇది జరిగిన రెండు రోజులకు శివాచారి నిద్రపట్టక మంచంమీద దొర్లు తూండగా, తన పెరట్లో ఎవరో దూకిన చప్పుడు వినపడింది. అతను చప్పుడైన దొడ్లోకి వెళ్ళి చూశాడు. ఎక్కడా మనిషి జాడ కనిపించలేదు.

శివాచారి దిక్కులు పరికిస్తూండగా అతని వెనకనుంచి ఎవరో మెరుపులాగా దూసుకుపోయి, చెంగున గోడదూకి అదృశ్యమయాడు.

తన నిధి రహస్యం ఏ దొంగవెధవ గాని కనిపెట్టలేదుగదా అనుకుంటూ

వీరేపల్లి జయరాంరెడ్డి

శివాచారి దేవుడిసొమ్ము పాతిపెట్టిన ప్రాంతంకేసి రెండడుగులు వేశాడో, లేదో, భటులు వచ్చి అతన్ని చుట్టు ముట్టారు. పారిపోయిన దొంగ కోసం వాళ్లు వచ్చి ఉంటారని గ్రహించి, దొంగ ఎటు పారిపోయినదీ శివాచారి వాళ్ళకు చెప్పాడు.

''నువుగాక ఇంకెవరు దొంగ? మా కళ్ళలో కారం కొట్టి పారిపోయి వచ్చి, ఇక్కడ దూరావు. దొంగసొమ్ము ఎక్కడ దాచావో చెప్పు,'' అన్నారు భటులు.

శివాచారి తనకేమీ తెలియదన్నాడు. భటులు పెరడులో వెతికేసరికి ఒక పాదలో దొంగసొమ్ము కనబడింది. వాళ్ళు శివాచారిని పట్టుకుపోయారు. ఈవిధంగా చెయ్యని దొంగతనానికి శివాచారికి శిక్ష పడింది.

మర్నాడు రాత్రికి ఆ దొంగ మళ్ళీ శివాచారి ఇంటికి వచ్చాడు. వాడిపేరు శంభుదాసు. శివాచారి ఇంట వాడికేమీ దొరకలేదు గాని, గూట్లో శివుడి విగ్రహం తళతళా మెరుస్తూ కనిపించింది. వెండి పూతగల ఆ విగ్రహం వెండిది అనుకుని శంభుదాసు దాన్ని తీసుకున్నాడు. అప్పుడు దానికింద ఉన్న చీటీ కింద పడింది. దానిలోనే నిధి దాచి పెట్టిన చోటు వివరాలున్నాయి.

ఒక మూట పోతే ఇంకొకటి దొరుకు తున్నందుకు శంభుదాసు పరమానందం చెంది, కాగితంలో గుర్తులను బట్టి శివా



చారి పాతిన నగల మూటను తవ్వి తీసుకుని, తనపై బట్టను జోలెలాగా తయారు చేసుకుని, నగల మూట అందులో వేసుకుని, దారిలో కొన్ని సజ్జ రొట్టెలు కొని, వాటిని కూడా జోలెలో వేసుకుని, సత్రం అరుగుమీదికి చేరాడు. ఆ అరుగుమీద ఎవడో బైరాగి తప్ప ఇంకెవరూ లేరు.

శంభుదాసు సజ్జరొట్టెలు కొన్ని తిని ఆకలి తీర్చుకుని, మిగతావి జోలెలో పెట్టేసి, ఆ జోలె తలకింద పెట్టుకుని నిద్రపోయాడు.

అతన్ని నిద్రపోనిచ్చి బైరాగివాడు, సజ్జరొట్టెల కోసం జోలె కాజెయ్యదలచి, తన సంచీ నుంచి ఏదో మత్తుమందు తీసి శంభుదాసు ముక్కు దగ్గిర పెట్టి అతనికి స్పృహతప్పించి, జోలె తీసుకుని అందులో ఉన్న రొట్టెలు తింటూ నగల మూట ఉన్నదని తెలుసుకున్నాడు.

వాడు నిజానికి బైరాగివేషం వేసుకున్న దొంగ. వాడి పేరు లింగస్వామి. తన దొంగవేషం విప్పేసి, ఆ మూటలోని నగలతో ఎటైనా పారిపోవటానికి ఆలోచిస్తుంటే వాడికి కొండమీది గుడి కనబడింది. వాడు వెంటనే, నిర్మానుష్యంగా ఉండే ఆ గుడికి బయలుదేరాడు.

లింగస్వామి వేషం మార్చుకుంటూండగా, ఆ తెల్లవారుఝామున గుడి ధర్మకర్తా, బంట్రోతులూ గుడికి వచ్చారు. అది గుడి ధర్మకర్త హుండీ తెరిచి లోపల ఉన్న కానుకలు చిఠా వేసుకునే రోజు. ధర్మకర్త హుండీ తెరిచి చూస్తే చాలా వెలితి కనబడింది. ఆయన భటులకు లింగస్వామి దేవుడి సొత్తుతో సహా దొరికాడు. దేవాలయం మనుషులు లింగస్వామిని చావగొట్టి తీసుకుపోయి కొత్వాలుకు అప్పగించారు.

దేవుడిసొమ్ము కారణంగా ఇద్దరు మనుషులు ఖైదులో పడినా ఆ సొమ్ము మాత్రం చివరకు దేవుడి దగ్గిరే ఉండిపోయింది!



# ప్రాణంగల బొమ్మ

ఒక పేదవాడికి ఇద్దరు కూతుళ్ళు. చిన్నతనంలోనే తల్లిపోతే తండ్రి వాళ్లను పెంచాడు. ఒకసారి చిన్నపిల్ల గుడ్డలతో ఒక బొమ్మ చేసి, అక్కకు చూపి, "నువు కూడా ఒక బొమ్మ చెయ్యి. రెంటికీ పెళ్లి చేద్దాం," అన్నది.

కాని అక్కకు బొమ్మలు చెయ్యటం చేతకాదు. ఆమె చెల్లెలి బొమ్మను లాక్కుని, తిరిగి ఇయ్యలేదు. చెల్లెలు ఏడుస్తుంటే, "ఏడవకమ్మా, అక్క బొమ్మను చేసినప్పుడు నేను నీ కిప్పిస్తాను గదా!" అన్నాడు తండ్రి.

తరవాత కొన్ని ఏళ్లకు పెద్దపిల్ల వివాహం అయింది. తరవాత ఆమె గర్భవతిగా ఉండి, ఒక ఆడపిల్లను కన్నది. ఆమె తండ్రీ, చెల్లెలూ వెళ్లారు. పెద్దపిల్ల బిడ్డను కంటూనే ఏదో జబ్బుచేసి, దానితోనే పోయింది. పోతూ పోతూ ఆమె తన చెల్లెలి చేతుల్లో తన బిడ్డను, ప్రాణం ఉన్న బొమ్మను, పెట్టి కన్ను మూసింది. —బి. లక్ష్మయ్య.





# తెలియవలసిన నిజం

రవీంద్రుడు ఉద్యోగం వెతుక్కుంటూ రాజధాని నగరానికి బయలుదేరాడు. అతను అక్కడికి చేరేసరికి చీకటి పడింది. ఆ రాత్రికి బసచెయ్యటానికి చోటు ఎక్కడ దొరుకుతుందని ఒక పెద్దమనిషిని అడిగాడు. ఆ పెద్దమనిషి రవీంద్రుడి పూర్వాపరాలన్నీ విచారించి, తన ఇంటికే తీసుకుపోయి, స్నానం చేయించి, భోజనం పెట్టి, అతిథి మర్యాదలన్నీ చేశాడు.

భోజనాలప్పుడు ఆ పెద్దమనిషికీ, రవీంద్రుడికీ ఒక అమ్మాయి వడ్డన చేసింది. భోజనాలయి, ఇద్దరూ విశ్రాంతిగా కూర్చున్నప్పుడు ఆ పెద్దమనిషి రవీంద్రుడితో, "మనకు వడ్డన చేసిన అమ్మాయి నా తమ్ముడి కూతురు. పేరు మాణిక్యం. నా తమ్ముడు రాజుగారి దివాణంలో పని చేసేవాడు. ఒకసారి దివాణానికి పోతూండగా అంబోతు కుమ్మి చచ్చిపోయాడు. వాడికి కొడుకులు లేరు గనక, వాడి ఉద్యోగాన్ని వాడి అల్లుడికి ఇస్తానని రాజుగారు మాట ఇచ్చారు. నీకు అభ్యంతరం లేకపోతే మా మాణిక్యాన్ని పెళ్ళాడి, ఉద్యోగంలో చేరు," అన్నాడు.

రవీంద్రుడు ఆలోచించాడు. మాణిక్యం అనాకారి కాదు. ఆమెను పెళ్ళిచేసుకుంటె తనకు శ్రమలేకుండా ఉద్యోగం వస్తుంది. వాడు మర్నాడు తెల్లవారగానే, మాణిక్యాన్ని పెళ్ళాడటానికి తన సమ్మతి తెలిపాడు. మరి నాలుగు రోజులకు పెళ్ళి జరిగిపోయింది.

తరవాత త్వరలోనే మాణిక్యం నైజం బయటపడింది. ఆమె గర్విష్ఠి, అహంకారి. తనవల్ల భర్తకు ఉద్యోగం దొరికిందని అతన్ని మహా చులకనగా చూసేది. తాను అతని పట్ల నిర్లక్ష్యంగా ఉండటమే

మాచిరాజు కామేశ్వరరావు

గాక, అతను అనుక్షణమూ తనకు కృతజ్ఞుడై ఉండాలని భావించేది. ''నన్ను చేసుకోకపోతే ఆయనకు ఈ ఉద్యోగం వచ్చి ఉండునా?'' అని ఆమె ఇరుగు పొరుగుల దగ్గిర గొప్పలు చెప్పుకునేది.

ఇదంతా చూసి రవీంద్రుడు బాధ పడినా భార్యను పల్లెత్తుమాట అనేవాడు కాడు. మాణిక్యానికి అది మరింత అలుసయింది.

మాణిక్యంవైపు చుట్టాలు వైద్యానికనే, వ్యాజ్యానికనే రాజధానికి వచ్చి, రవీంద్రుడి ఇంట దిగేవాళ్లు. వాళ్లు ఒకంతట వెళ్లేవాళ్లు కారు. ఒకవేళ వాళ్లు వెళతామన్నా మాణిక్యం బల వంతం చేసి వారిని ఆపేది; వాళ్ళకు ఏలోటూ లేకుండా జరిపేది. రవీంద్రుడు అది కూడా సహించాడు.

మాణిక్యానికి వేలువిడిచిన మేనత్త ఒకావిడ, వితంతువు, మాణిక్యాన్ని చూసే నెపంమీద నలుగురు పిల్లలతో రవీంద్రుడి కొంపలో శాశ్వతంగా తిష్ఠవేసి, కాలక్షేపంకోసం భార్యాభర్తల మధ్య చిన్న చిన్న తగూలు పెట్టి, తమాషా చూడసాగింది.

''మీ మేనత్తకు ఇల్లూ, వాకిలీ లేదా? ఎంత కాలం ఉంటుంది ఇక్కడ?'' అని రవీంద్రుడు మాణిక్యాన్ని అడిగాడు.

మాణిక్యం రెచ్చిపోయి, ''నీ కంటే



ఎవరూ లేరు. నాకు బంధు బలగం ఉన్నది. వాళ్లు వచ్చి తింటున్నారని నీ కెందుకు ఉడుకుమోతుతనం? వాళ్లు ఎంతకాలం ఉన్నా నాకభ్యంతరంలేదు. నా చలవవల్లనే ఈ ఇల్లు గడుస్తున్నది. ఈ విషయం నువు మరెన్నడూ ఎత్త కుండా ఉంటే మర్యాదగా ఉంటుంది," అన్నది.

రవీంద్రుడు ఏమీ అనలేదు. రెండు రోజుల అనంతరం వాడు దివాణానికి వెళ్లడం మానేసి, ఇంట్లోనే ఉండిపో సాగాడు. మాణిక్యం ఉద్యోగానికి పోవటంలేదేమని మొగుణ్ణి అడిగింది.

''ఇకేం ఉద్యోగం? జీతంరాళ్ళు ఈ సత్రంలాంటి కొంప నడపటానికి ఏ

మూలకూ చాలక లంచాలు మరిగి, దొరికిపోయాను. ఉద్యోగం ఊడింది!'' అన్నాడు రవీంద్రుడు.

మాణిక్యం నెత్తీ, నోరూ బాదుకుని, నోరు నొప్పి పుట్టేదాకా భర్తను తిట్టి పోసింది. నాలుగురోజులకు ఇంట్లో ఉన్న డబ్బంతా అయిపోయింది. మేనత్త దగ్గిర డబ్బు ఉండటం చూసి, మాణిక్యం ఆమెను బదులు అడిగింది.

ఆవిడ వెంటనే మూటా, ముల్లే సర్దుకుంటూ, ''ఇది మరీ బాగుంది! ఉద్యోగమూ, సద్యోగమూ లేనివాళ్ళకి మెడమీద తల ఉన్నవాళ్లెవరన్నా అప్పు పెడతారా?'' అని తన ఊరు వెళ్ళిపోయింది పిల్లలతోసహా.

ఆవిడ బంధుప్రీతి ఎలాటిదో మాణిక్యానికి అర్థమయింది. ఆ కృతఘ్నురాలిని వెనకవేసుకువచ్చి తాను తన భర్తను నానా మాటలూ అన్నది! ఆవిడ పోషణకోసం తన భర్త లంచాలు పట్టి, ఉద్యోగం పోగొట్టుకోవలసి వచ్చింది! కాని తన అవసరం లక్ష్యపెట్టకుండా ఆవిడ వెళ్ళిపోయింది.

మాణిక్యం మొహం చేతుల్లో దాచుకుని, వెక్కివెక్కి ఏడవసాగింది.

రవీంద్రుడు మాణిక్యాన్ని ఓదార్చుతూ, ''ఏడవకు. నా ఉద్యోగం ఎక్కడికీ పోలేదు. మనుషుల స్వభావాలు ఎలా ఉంటాయో నీకు తెలియగలందుకు అబద్ధం ఆడాను. బంధువులలో నిజమైన ఆప్తులెవరో మనం వెయ్యి కళ్లతో కనిపెట్టి వుండాలి. భార్యాభర్తలు పరస్పరం అర్థంచేసుకుని అన్యోన్యంగా ఉండాలి గాని, ఒకరికొకరు కృతజ్ఞులై ఉండటమేమిటి? నీ మూలాన నాకు ఉద్యోగం దొరికిన మాట నిజమే. కాని దాన్ని నిలబెట్టుకునే సామర్థ్యం నాది గాని, నీది కాదే! ఈ పాటి నిజాన్ని నువు తెలుసుకోవాలి,'' అన్నాడు.

అటు తరవాత మాణిక్యం పూర్తిగా మారిపోయింది.



# తిరిగివచ్చే వరాలు

ఇద్దరు అన్నదమ్ములు ఉన్న ఊళ్లో బతకలేక, డబ్బు సంపాదనకుగాను దేశం మీద బయలుదేరారు. దారిలో మధ్యాహ్నం వేళ వాళ్ళు భోజనం చెయ్యటానికి ఆహారం మూట విప్పగానే, ఎవరో యోగి వారి దగ్గిరికి వచ్చి, "నాక్కూడా పెడతారా? ఆకలిగా ఉన్నది," అన్నాడు.

అన్నదమ్ములు వాళ్ళ ఆహారాన్ని రెండు భాగాలు చేసి, ఒక సగం యోగికి ఇచ్చి, మిగిలినది ఇద్దరూ తిన్నారు.

యోగి తృప్తిపడి వెళ్ళిపోతూ, "నా దగ్గిర నా గురువుగారిచ్చిన వరాలు రెండు ఉన్నాయి. అవి తిరిగివచ్చే వరాలు. వాటిని మీకు చెరొకటీ ఇస్తాను. మీరు ఎవరికైనా ఏమి కోరుతారో అదే మళ్ళీ మీకు వస్తుంది," అని చెప్పి వెళ్ళిపోయాడు. అవేం వరాలో వారికి అర్థంకాలేదు.

తరవాత ఇద్దరూ తలా ఒక దిక్కూ వెళ్ళారు. అన్న మంచివాడు, తనకు సహాయం చెయ్యనివాళ్ళను గురించి పట్టించుకోక, సహాయపడినవారికి సౌభాగ్యం కలగాలని కోరుకున్నాడు.

తమ్ముడు కోపిష్ఠి. తనకు సహాయం చెయ్యనివాళ్ళను దుమ్మెత్తిపోస్తూ, "నీ నోరు పడిపోనూ! నీ కడుపుమండా," అని తిట్టాడు.

యోగి చెప్పినట్టుగా వరాలు ఫలించి అన్న ఐశ్వర్యవంతుడయాడు. తమ్ముడు రోగాల పుట్ట అయాడు.





# రాచబాట

కోసల దేశపు రాజైన అనంగపాలుణ్ణి అతడి సేనాపతి సౌవీరుడు కుట్రచేసి చంపి, రాజ్యాన్ని హస్తగతంచేసుకున్నాడు. అనంగపాలుడి ముగ్గురు కొడుకులూ ప్రాణాలు దక్కించుకుని పారిపోయి, కాశీరాజ్యంలో ఒక బ్రాహ్మణుడి ఇంట తలదాచుకున్నారు.

ఆ బ్రాహ్మణుడు వాళ్ళను తన రక్షణలోనూ, పోషణలోనూ ఉంచుకుని, వాళ్లకు విద్యలు నేర్పి, యుక్తవయసు వచ్చినదాకా తన ఇంట ఉంచుకుని, "ఇప్పుడు మీరు విద్యావంతులు. ఈడేరినవాళ్లు. ఇక మీరు మీకు ఏది ఉత్తమ జీవితమార్గం అని తోస్తే, ఆ మార్గంలో జీవించండి," అన్నాడు.

ముగ్గురిలోకీ పెద్దవాడైన ఆదిత్యుడికి సేనను పోగుచెయ్యడమే ఉత్తమ మార్గమనీ, సైనికబలంతోనే సేనాపతి తమ రాజ్యం కాజెయ్యగలిగాడనీ అనుకున్నాడు.

రెండోవాడు విక్రముడికి ధనమే అన్ని సాధనాలకూ మూలమనీ, అది లేకుండా సేనలను పోషించటం కూడా సాధ్యంకాదనీ, అందుచేత ముందు ధనం సంపాదిస్తే, తరవాత ఏదైనా తేలికగా సాధించవచ్చుననీ అనిపించింది.

మూడోవాడు ఉదయభానుడు, సైన్యంగాని, ధనంగాని ఉన్నత ఆశయాలు కావనీ, తమ తండ్రి రాజు అయినా తమకు దిక్కుమాలిన జీవితం తప్ప లేదనీ, అందుచేత ఉన్నదానితో సంతృప్తి పడటమే అత్యుత్తమమనీ, తమ సేనాధిపతి అలా తృప్తిపడి ఉంటే తమ రాజ్యం తమ చేతినుంచి పోయిఉండేది కాదనీ అనుకున్నాడు.

ముగ్గురూ తమ ఆశయాలు సాధించడం

వి. రాజారావు

కోసం కృషిచేసి, అయిదు సంవత్సరాల అనంతరం తిరిగి బ్రాహ్మణుడి ఇంటనే కలుసుకోవాలనీ, తమ ఆశయాలు ఎంత మేరకు నెరవేరినదీ తెలుసుకోవాలనీ నిర్ణయించుకున్నారు.

ఆదిత్యుడు కోసల రాజ్యానికి వెళ్ళి, రహస్యోద్యమం సాగించాడు. అతను సేనాపతి చేసిన కుట్ర గురించి ప్రజలలో ప్రచారంచేసి, సింహాసనానికి వారసులు బతికే ఉన్న సంగతి తెలిపి, సేనను సేకరించసాగాడు. తిరుగుబాటుకు అవసరమైన పదివేల సేన, దళాధిపతులతోసహా, అతని నాయకత్వం కింద తయారయింది. ఈ పని సాధించి అతను అయిదేళ్ళకు బ్రాహ్మణుడి ఇంటికి తిరిగివచ్చాడు.

విక్రముడు దొంగల నాయకుడుగా ఆరితేరి, నూరుమంది దొంగల చేత మూటలు ఎత్తించుకుని ఐదేళ్ళకు తిరిగి వచ్చాడు.

ఉదయభానుడు ఈ అయిదేళ్ళూ ఏదో గ్రామంలో ఉండి, కొంతకాలం వ్యవసాయకూలీగా పనిచేసి, క్రమంగా గ్రామ వ్యవహారాలలో చొరవతీసుకుని, బావులూ, చెరువులూ, కాలువలూ తవ్విస్తూ, గ్రామప్రజలలోనూ, చుట్టుపట్ల గ్రామాలలోనూ మంచి పేరు ప్రతిష్ఠలు సంపాదించి, బ్రాహ్మణుడి ఇంటికి తిరిగివచ్చాడు.

ముగ్గురు సాధించినదీ విని వాళ్ల



గురువు, "సరే, మీరు కోసల రాజ్యానికి తిరిగిపోయి, మీరు సాధించిన శక్తులతో మీ తండ్రి రాజ్యాన్ని తిరిగి సంపాదించి, పంచుకుని సుఖంగా ఉండండి," అన్నాడు.

పెద్దవాళ్ళిద్దరూ మూడోవాణ్ణి కూపస్థ మండూకం కింద జమకట్టేశారు. అతడికి రాజ్యకాంక్ష లేదు. పెద్దవాళ్ళు కోసల రాజ్యానికి బయలుదేరారు. పెద్దవాడికి రెండోవాడి వెంట ఉన్న ధనంపై కన్ను పడింది. సైనికులు రాజభక్తితో తిరుగుబాటు చెయ్యవచ్చుగాని, వాళ్ళను పోషించటానికి ధనం కావాలి.

అతను విక్రముడితో, "నీ ధనాన్ని నా సేన కోసం ఖర్చుపెట్టు. రాజ్యం సంపాదించినాక ఇద్దరమూ పంచుకుందాం," అన్నాడు.

"నా డబ్బుతో పోషించే సేన నాది అవుతుందిగాని, నీది ఎలా అవుతుంది? రాజ్యంలో నీకు భాగం ఇచ్చేపనేమిటి?" అన్నాడు విక్రముడు తన అన్నతో. ఆ సైన్యాన్ని పోగుచెయ్యటానికి ఆదిత్యుడు పడిన శ్రమ మరిచిపోయి.

ఆదిత్యుడికి మండిపోయింది. ఇద్దరూ ఘర్షణపడ్డారు. విక్రముడు తన అన్నను చంపి, సేన తనదేనన్నాడు. అతను సైనికబలంతోనూ, కుట్రలో పాల్గొన్న ప్రముఖుల సహాయంతోనూ తమ పాత సేనాపతిని చంపి, తానే రాజయ్యాడు.

అయితే ముఖ్యులైన కుట్రదారులు విక్రముడు రాజు కావటానికి ఒప్పుకోక, తమ అసలు నాయకుడు ఆదిత్యుడేననీ, విక్రముడు అతన్ని చంపిన హంతకుడు మాత్రమేననీ పితూరీ లేవదీశారు. మళ్ళీ సంఘర్షణజరిగింది.అందులో విక్రముడు చచ్చిపోయాడు.

సింహాసనానికి దిక్కు లేకుండా పోయింది. పురప్రముఖులు, దానికి మూడో వారసుడైన ఉదయభానుణ్ణి వెతుక్కుంటూ పోయి, అతన్ని బతిమాలి తెచ్చి కోసల సింహాసనం మీద పట్టాభిషిక్తుణ్ణి చేశారు.





# తగిన శాస్తి

సీతారామయ్య పరమలోభి. ఎంత లోభి అంటే, డబ్బు ఖర్చవుతుందని కూతురికి పెళ్ళికూడా చెయ్యలేదు. సీతారామయ్య పొరుగున రంగడు అనే యువకుడున్నాడు. అతనికి ఎవరూలేరు. పట్నంలో పాలు అమ్మి, ఆ డబ్బుతో జీవించేవాడు. రంగడు సీతారామయ్య కూతుర్ని చేసుకుంటాననీ, తనకు బట్టలు కూడా పెట్టనవసరం లేదనీ, మూడు రూపాయలతో గుళ్లో దండలు మార్చుకుంటే చాలుననీ అన్నాడు. మూడురూపాయలు ఖర్చు చెయ్యటానికి మనసొప్పక, సీతారామయ్య పెళ్ళి వాయిదా వేస్తూ వచ్చాడు.

ఉన్నట్టుండి ఒకరోజు సీతారామయ్యకు చక్రపొంగలి మీద మనసు పోయింది. చక్రపొంగలికి ఖర్చు అవుతుంది. చక్రపొంగలి తిని తీరవలసిందే! కాని ఇంట్లోచేయిస్తే భార్యా, కుమార్తే కూడా తింటారు. సమయానికి వాసన పసిగట్టి ఇరుగు పొరుగు వాళ్ళు వస్తే, వాళ్ళకూ కొంచెం పెట్టాలి.

ఈ చిక్కులన్నీ ఆలోచించి, సీతారామయ్య చక్రపొంగలికి కావలసిన సరంజామా అంతా రహస్యంగా ఒక బుట్టలో సర్ది, ఇంకా తొలికోడి కూయకముందే భార్యను లేపి, ''ఏమేవ్, నేను పనిమీద పోతున్నాను. సాయంకాలానికి గాని రాను,'' అన్నాడు.

ఒక రోజన్నా భర్తపీడ వదిలినందుకు సీతారామయ్య భార్య సంతోషించి, రాత్రి మిగిలిన గంజి ఇంత తన భర్తకు ఇచ్చింది.

ఇంకా తూర్పు తెల్లవారలేదు. సీతారామయ్య అడవికి పోయి మూడు రాళ్లు తెచ్చి పొయ్యిచేసి, ఎండు

ఆళ్ళ కృష్ణవేణి

చితుకులు పోగుచేసి, బియ్యమూ, పెసర పప్పూ, పాలూ, నెయ్యీ అన్నీ బుట్టలో నుంచి తీసి, కుండను పొయ్యిమీద పెట్టి చక్రపొంగలి చెయ్య నారంభించాడు. దాన్ని సాయంకాలం దాకా కొంచెం, కొంచెం తిని, ఇంటికి తిరిగి పోవాలని అతని ఆలోచన.

కొద్దిసేపట్లోనే కమ్మని నేతివాసన అడవి అంతటా వ్యాపించింది. చక్ర పొంగలి తయారయింది. దాన్ని పొయ్యి మీదినుంచి దించి, చల్లారబెట్టుదామను కుంటూండగా, అతని వెనకనుంచి రెండు చేతులు వచ్చి, కుండను తీసేసు కున్నాయి. సీతారామయ్య గాభరాగా తలఎత్తి చూసేసరికి నలుగురు యమ కింకరులలాటి మనుషులు కనపడ్డారు. వాళ్ళు పేరుమోసిన గజదొంగలు.

అతన్ని పట్టించుకోకుండా దొంగలు నాలుగు టేకు ఆకులు కోసి, కడిగి తెచ్చుకుని, చక్రపొంగలి అందులో వేసు కుని, కబుర్లు చెప్పుకుంటూ తిని, కుండలో ఒక్క పిసరైనా మిగలకుండా అంతా ఊడ్చేసి, దాన్ని దూరంగా గిర వాటు వేసి, సీతారామయ్యకు వెళ్ళి వస్తామని అయినా చెప్పకుండా, మీసాలు తుడుచుకుంటూ వెళ్ళిపోయారు.

సీతారామయ్య కాళ్ళీడ్చుకుంటూ మిట్టమధ్యాన్నానికి ఇల్లు చేరేసరికి కొంప బావురుమంటున్నది. తలుపులు తెరిచి వున్నాయి. ఇంట్లో భార్యా, కూతురూ ఇద్దరూ లేరు. భోషాణం దగ్గిరికి పరిగెత్తి చూస్తే, భోషాణంకూడా ఖాళీగా ఉన్నది. అతని డబ్బంతా, ఆ భోషాణంలోనే ఉండేది.

గుండెలు బాదుకుంటూ సీతా రామయ్య రోడ్డెక్కాడు. ఆ ఉదయమే తన భార్య తన కూతుర్ని రంగడి కిచ్చి గుడిలో పెళ్ళి చేసిందనీ, అందరూ కలిసి, దూరంగా వున్న భార్య పుట్టింటికి కొన్నాళ్ళుండి వచ్చేందుకు వెళ్ళారనీ తెలిసింది. చేసేది లేక సీతారామయ్య కూడా అక్కడికే బయలుదేరాడు.





సంజయ్ అర్జున్‌ను తన వెంట తీసుకుని ఊరి బయట ఉన్న మర్రిచెట్టు వేపు పోతూ, "నువు కూడా జోస్యం చెప్పించు కోరాదా? రెండు రోజుల క్రితం మన ఊరికి కొక కొత్త జ్యోతిష్కుడు వచ్చాడు. ప్రశ్నకు అర్ధరూపాయి తీసుకుంటాడు. కారుచౌక!" అన్నాడు.

తన భవిష్యత్తు తెలుసుకోవటానికి కాదుగాని, ఆ జ్యోతిష్కుడి భవిష్యత్తు తెలుసుకోవటానికి వెళ్ళి తీరాలని అనుకున్నాడు అర్జున్. అలాటి వాళ్ళను అతను చాలామందిని చూశాడు. హేతువాదమూ, కొంత ఇంద్రజాలమూ తెలియటంచేత అతను ఇలాటివాళ్లను ఒకంతట నమ్మడు. ఈ జ్యోతిష్కుడు మోసగాడయితే గ్రామస్థులను వీడినుంచి కాపాడాలి; అలాగాక, వీడు శక్తిమంతుడైతే వీణ్ణి తగినవిధంగా సన్మానించాలి.

ఇలా అనుకుని అర్జున్ ఇతర గ్రామస్థులతో కలిసి మర్రిచెట్టు కిందికి వెళ్ళి, దాని కింద గంభీరంగా కూర్చుని ఉన్న జ్యోతిష్కుణ్ణి చూశాడు. అతను ఎర్రధోవతీ, ఎర్ర చొక్కా ధరించి ఉన్నాడు. అతని జుట్టు దీర్ఘంగా భుజాల మీదుగా వేళ్ళాడుతున్నది. అతని వెనకగా నల్లని పొదలున్నాయి. అతనికీ, పొదలకూ మధ్యగా ఒక మట్టి వేదిక ఉన్నది. దాని మధ్యగా ఒక ఉక్కుచువ్వ నిలబెట్టి ఉన్నది. వేదికకు ఒకపక్కగా ఎర్రరంగు పూసిన చిన్న కపాలం ఉన్నది.

జ్యోతిష్కుడు ధ్యానంలో నిమగ్నుడై ఉన్నాడు. అతని ముగ్గురు శిష్యులలో ఒకడు చూడవచ్చిన వారిని సోల్పులో నిలబెట్టుతున్నాడు. వాళ్ళు ఇరవై ఐదు మంది ఉన్నారు. అపరాహ్ణమే అయినా ఆ మహావృక్షం కింద మసకగా ఉన్నది.

---

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు

---




జ్యోతిష్కుడు కళ్ళు తెరిచి, "మీరంతా మీ భవిష్యత్తు తెలుసుకుందామని వచ్చారు. నిజానికి నాకు జ్యోతిషం ఏమీ తెలియదు. జ్యోస్యం చెప్పేది ఈ కపాలం. ఇది నేను పుట్టకపూర్వం ఈజిప్టులో చనిపోయిన ఒక బిడ్డది. ఈ కపాలాన్ని బరువైన బంగారు పేటికలో ఉంచి, మధ్యధరా సముద్ర జలంలో నిమజ్జనం చేస్తేగాని ఆ బిడ్డకు ఉత్తమ లోకాలు కలగవు. అందుకోసం నేను డబ్బు పోగుచేస్తున్నాను. అందుచేత మీరు ప్రశ్నకు అర్ధరూపాయి ఇయ్యాటానికి సంకోచించవద్దు. ఒకరొకరే రండి. సత్యానందా, ఆ కపాలం ఇలాతే!" అన్నాడు.

సత్యానందుడు అందించిన కపాలంలో పైనుంచి కిందికి ఒక రంధ్రం ఉన్నది. దాన్ని అందరికీ చూపించి జ్యోతిష్కుడు కపాలాన్ని సత్యానందుడికి తిరిగి ఇచ్చాడు. సత్యానందుడు దాన్ని వేదిక మీది ఉక్కు చువ్వకు దిగవేశాడు.

"ఇప్పుడు మీరు ప్రశ్నలు అడగవచ్చు. కపాలం పైకి లేచిపడితే ప్రశ్నకు ఔనని సమాధానం. అది కదలకపోతే కాదని సమాధానం," అన్నాడు జ్యోతిష్కుడు.

సోల్పులో అందరికన్న ముందున్న వయసుమళ్ళినవాడు జ్యోతిష్కుడి ముందున్న పళ్ళెంలో అర్ధరూపాయి వేసి, "నేనింకా కొంతకాలం బతుకుతానా?" అని అడిగాడు.

అందరూ కపాలం కేసి చూశారు. చిత్రంగా ఆ కపాలం పైకి లేచి, కింద పడింది. ప్రశ్న అడిగినవాడు మరి కొంత కాలం బతుకుతాడన్నమాట! అతను జ్యోతిష్కుడికి దణ్ణం పెట్టి, పక్కకు తొలగాడు.

తరవాతవాడు రామనాధుడనే రోగిష్టి. వాడు డబ్బు పళ్ళెంలో వేసి, "నేను త్వరగా చచ్చిపోతానా?" అని అడిగాడు.

కపాలం కదలలేదు!

ఇలా అందరూ ప్రశ్నలడిగి వెళ్ళిపోయినదాకా అర్జున్ జరిగేదంతా శ్రద్ధగా

గమనిస్తూ ఉండి. ఆ రాత్రి అంతా దీర్ఘంగా ఆలోచించి, ఒక నిర్ధారణకు వచ్చాడు. తెల్లవారగానే అతను జ్యోతిష్కుణ్ణి కలిశాడు.

"ఏమయ్యా, ఏం కావాలి?" అని జ్యోతిష్కుడు మృదువుగా అడిగాడు.

"నా భవిష్యత్తు చెప్పించుకోవాలి," అన్నాడు అర్జున్.

"అందుకు ఇది సమయం కాదు. కపాలం విశ్రాంతి తీసుకుంటున్నది. అందరితోబాటు అపరాహ్ణంలో రా," అన్నాడు జ్యోతిష్కుడు.




అర్జున్ పరిసరాలను సూక్ష్మంగా పరిశీలించాడు. అతనికి ఆసక్తి కలిగించినది వేదిక పక్కన ఉన్న చిన్న గుడారం మాత్రమే. జ్యోతిష్కుడూ, అతని శిష్యులూ ఉండేది ఆ గుడారంలోనే. ఆ గుడారం ఉన్న స్థలాన్ని గమనించాక అతని అనుమానం దృఢపడింది.

అతను అక్కడినుంచి వచ్చేసి, మోసం ఎలా బయటపెట్టటమా అని ఆలోచించాడు. అతను వరండాలో కూర్చుని ఉన్నాడు. అతని కొడుకు ఒక సైకిల్ చక్రాన్ని కర్రపుల్లతో నడిపిస్తూ ఆడుకుంటున్నాడు. అది చూడగానే అతనికి ఒక ఆలోచన స్ఫురించింది. అతను సైకిల్ చక్రాన్ని తన కొడుకు వద్దనుంచి తీసుకుని, కొన్నిసార్లు నడిపించి, తనకు విజయం కలగబోతున్నందుకు మురిసిపోయాడు.

ఆ రోజు అపరాహ్ణం అర్జున్ తన కొడుకును వెంటబెట్టుకుని జ్యోతిష్కుడి వద్దకు వెళ్ళాడు. గ్రామస్థులు చేరి ఉన్నారు. త్వరలోనే ప్రశ్నలు ఆరంభమయాయి. తన వంతు రాగానే అర్జున్, కాగితం మీద రాసిన నాలుగు ప్రశ్నలు జ్యోతిష్కుడికి చూపి, పళ్ళెంలో రెండు రూపాయలు పెట్టి, "అయ్యా, నా ప్రశ్నలకు సమాధానం చెప్పేముందు ఈ సైకిలు చక్రాన్ని అవతలికి పారెయ్యనియ్యండి," అంటూ, దాన్ని బలంగా శిష్యుడు వున్న

గుడారానికీ, వేదికకూ మధ్యగా, పాదల కేసి దొర్లించాడు.

చక్రం గుడారానికీ, వేదికకూ మధ్యగా పోతూండగా ఉక్కుచువ్వ మీద కపాలం ఎగిరిపడింది. అర్జున్ ముఖంమీద మంద హాసం గోచరించింది. జ్యోతిష్కుడి ముఖాన కత్తివాటుకు నెత్తురుచుక్కలేదు. అతను అర్జున్ కేసి తీవ్రంగా చూశాడు.

అర్జున్ ఇకిలిస్తూ, "నా మొదటి ప్రశ్న: సూర్యుడు తూర్పున ఉదయిస్తాడా? రెండో ప్రశ్న: ఇనుముకన్న దూది తేలికా? మూడోది: బంగారం ఇత్తడి కన్న హెచ్చు ఖరీదా? నాలుగోది: మంచు అగ్ని కన్న చల్లగా ఉంటుందా? అయ్యా, జ్యోతిష్కుడుగారూ, నేను డబ్బు చెల్లించాను గనక, ఈ చిన్న ప్రశ్నలకు కపాలం చేత జవాబులు చెప్పించండి," అన్నాడు.

కపాలం కదలలేదు. జ్యోతిష్కుడూ, అతని మనుషులూ తప్పించుకుపోయే ప్రయత్నంలో ఉండటం చూసి, అర్జున్ తన మనుషులకు సైగ చేశాడు. వాళ్ళు మోసగాళ్ళను చుట్టుముట్టారు. అర్జున్ గ్రామస్థులతో ఇలా అన్నాడు:

"మిత్రులారా, మన అమాయికత్వం ఆధారం చేసుకుని ఈ మనిషి మనని మోసం చేశాడు. ఇది నిజమైన కపాలం కాదు, కాగితం గుజ్జుతో చేసినది. దీన్ని సన్నని, బలమైన నల్లదారంతో పైకీ, కిందికీ ఆడిస్తాడు. దారం ఒక కొస ఉక్కు కడ్డీ చివరకు కట్టి ఉంటుంది. రెండో చివర గుడారంలో ఉండే మనిషి చేతిలో ఉంటుంది. ఈ కాగితం కపాలం ఉక్కు కడ్డీలో దిగవేసినప్పుడు దారం దాన్ని చుట్టుతుంది. గుడారంలో వాడు దారం లాగితే, కపాలం లేస్తుంది, దారం వదలగానే మళ్ళీ దిగుతుంది."

వేదికనూ, గుడారాన్నీ పరిశీలించగా అర్జున్ చెప్పినది రుజువయింది. జ్యోతిష్కుడు మోసంతో సంపాదించిన డబ్బంతా గ్రామస్థులు తిరిగి తీసుకుని, జ్యోతిష్కుణ్ణీ, అతని అనుచరులనూ పోలీసులకు అప్పగించారు.





# వీర హనుమాన్

అయోధ్యలో ఒకనాడు రాముడు, మంత్రి సామంతాదులతో కొలువుతీరి ఉండగా, విశ్వామిత్ర మహర్షి చరచరా సభను ప్రవేశించి, ''ఓయి రామా! కాశికాపురి రాజైన యయాతి గర్వాంధుడై నన్ను అవమానించాడు. ఆ రాజాధముణ్ణి నీవు వెంటనే పరిమార్చాలి! గురువుగా ఇది నా ఆజ్ఞ!'' అని చెప్పి, వచ్చినట్లే చరచరా వెళ్ళిపోయాడు.

విశ్వామిత్రుడి ఆజ్ఞకు రాముడు విస్తుపోయాడు. యయాతి రాముడిపట్ల వినయవిధేయలతో కాశీరాజ్యాన్ని ధర్మం తప్పకుండా పాలిస్తూన్న సామంతుడైన రాజు. విశ్వామిత్రుడు తొలుత యాగరక్షణకోసం రామలక్ష్మణులను తీసుకు వెళ్ళి, రాముడికి ఎన్నెన్నో దివ్యాస్త్రాలను ఉపదేశించి బల, అతిబల మొదలైన విద్యలను ప్రసాదించిన గురుదేవుడు. ప్రజానురంజకుడై, తనపట్ల భక్తికలిగి వున్న యయాతిని ఎలా చంపడం? విశ్వామిత్రుడి ఆజ్ఞను ఎలా త్రోసిపుచ్చడం?

రాముడు అప్పటికి సభ చాలించి, లేచి వెళ్ళి, ఆంతరంగిక మందిరానికి సుమంతుణ్ణి పిలిపించి, ''సుమంతా! ఇది నా అంతరంగిక వ్యక్తిగత విషయం! నేను ఒంటరిగాపోయి యయాతిని వధించక తప్పదు. మే మిద్దరమూ ద్వంద్వయుద్ధం చేస్తాము. అంతకు మించి ఎటువంటి ప్రజాక్షయమూ జరగవలసిన పనిలేదు. రాముడు నిన్ను చంపడానికి వస్తున్నాడని

## 41. రామాంజనేయ యుద్ధం



యయాతికి వర్తమానం పంపించండి,'' అని స్థిరచిత్తంతో చెప్పాడు.

జరిగిన దేమంటే, కాశీనగరాన్ని పాలిస్తున్న యయాతితో గ్రామీణప్రజలు వచ్చి, అరణ్యాల నుంచి ఏనుగుల మందలు, ఇతర వన్యమృగాలు తమ పల్లెలపైబడి అపారనష్టాన్ని కలిగిస్తున్న వని మొరపెట్టుకున్నారు యయాతి వేటాడ్డం కోసం బయలుదేరాడు. అప్పుడే విశ్వామిత్రుడు ఆ దారిన వస్తున్నాడు. వేట సంరంభంలో వేగంగా పరుగిడు తూన్న రథంలో కూర్చుని ఉన్న యయాతి విశ్వామిత్రుడి ఆగమనాన్ని గమనించక, వేటకు వెళ్ళిపోయాడు.

అది తనపట్ల ఘోరమైన అవమానంగా విశ్వామిత్రుడు భావించి, ''రథం దిగి ప్రణమిల్లి, భక్తి శ్రద్ధలు చూపవలసిన దానికి మారుగా, నన్నింత పరాభవించిన ఈ యయాతిని అంత మొందించకపోతే, నేను విశ్వామిత్రుణ్ణే కాను!'' అని ప్రతిజ్ఞ చేసి, సరాసరి రాముడి దగ్గిరకు వెళ్ళి, అజ్ఞాపించిపోయాడు.

చారులు తెచ్చిన వర్తమానాన్ని అందుకొని యయాతి భయంతో తల్లడిల్లి పోయాడు. యయాతి భార్య యశోధర. ఆ దంపతులకు చంద్రాంగదు డనే కుమారుడు, చంద్రముఖి అనే కుమార్తె ఉన్నారు. ఆ కుటుంబానికి రాముడి యందు చాలా ఆరాధన ఉన్నది. అందరూ ఒక్కసారిగా శోకసముద్రంలో మునిగిపోయారు.

కొంతసేపటికి యయాతి తెప్పరిల్లి, ''శరణాగతుణ్ణి, నిరపరాధిని, నీ దయ అని నేనే రాముణ్ణి స్వయంగా వేడు కుంటాను,'' అని లేచాడు.

ఆ రాజూ, కుటుంబం అంతా కలిసి అయోధ్యకు వెళ్ళడానికి బయలుదేరు తూండగా, వారికి నారదుడు ఎదు రయ్యాడు. నారదుడు యయాతిని చూచి ఫక్కున నవ్వి, ''అమాయకుడా! ఆపత్కాలంలో, నీ వివేకం పూర్తిగా

పోయిందిలాగుంది. ఒకే బాణం, ఒకే మాట అని పేరొందిన రాముడు, నిన్ను వధించి తీరుతాడు. ఆలోచించడానికి వ్యవధి లేదు. అంజనాదేవి ఆశ్రమానికి తక్షణం వెళ్ళు. ఆమె అభయం కోరుకో. హనుమంతుడు ఆమె కుమారుడే గద. కొంతకాలంగా అక్కడే ఉంటున్నాడు." అని చెప్పాడు.

యయాతికి, నారదుడి మాటలు నచ్చాయి. అంజనాదేవి ఆశ్రమానికి పరిగెత్తాడు. ఆశ్రమంలో అంజనాదేవి ధ్యానం ముగించి లేస్తూ, "శరణాగతుడను! రక్షించండి! ప్రాణభీతితో, అభయం కోరి వచ్చాను!" అనే ఆర్తనాదం విని యివతలకు వచ్చింది. చేతులు జోడించి ప్రాణభీతితో కంపించిపోతూన్న యయాతి కనిపించాడు.

"నాయనా, భయం విడిచిపెట్టు! నా కుమారుడి మీద ఒట్టుపెట్టి చెబుతున్నాను, నీ కెటువంటి ఆపదారానీయను!" అని అంజనాదేవి యయాతికి అభయమిచ్చింది.

అప్పుడే హనుమంతుడు గంధమాదన పర్వతం నుండి వచ్చాడు. యయాతి తల్లికుమారులిద్దరి ముందూ ప్రణామాలు చేసి, "నా పేరు యయాతి, కాశీరాజును, రాముని యందు భక్తిప్రపత్తులు గలవాడను. నన్ను రక్షించగలవారు మీరు తప్ప మరెవ్వరూ లేరు!" అని భయం భయంగా చెప్పుకున్నాడు.



హనుమంతుడు యయాతిని భుజాలు పట్టి లేవనెత్తి, "ఓ రాజా, ఇప్పుడేగదా, మా అమ్మ నీకు అభయమిచ్చింది! ఇంకా భయపడతావెందుకు? నా తల్లి మాట నిలబెట్టుతానని నేను కూడా ప్రతిజ్ఞ చేస్తున్నాను," అన్నాడు.

అప్పుడు యయాతి, "హయ్యో, ఓ ఆంజనేయా! ఏమని చెప్పగలను? రాముడు నన్ను నిష్కారణంగా చంపబోతున్నాడు!" అని చెప్పి, జరిగినదంతా వివరించాడు.



హనుమంతుడు అంతా నిశ్చలంగా విన్నాడు. అంజనాదేవి, ''ఎంత పొరబాటు జరిగిపోయింది! నేను తెలియక అభయ మిచ్చాను!'' అని విచారించసాగింది.

అప్పుడు హనుమంతుడు తల్లితో, ''అమ్మా! ఇప్పుడు చింతించవలసిన దేమీ జరగలేదు. ఆర్తులను రక్షించడం కంటే గొప్ప ధర్మం వేరేదీ లేదుగదా! ఈ యయాతికి నేను జీవించి ఉండగా ఎటువంటి హానీ జరగదు!'' అని చెప్పాడు.

యయాతికి హనుమంతుడు అభయ ప్రదానం చేసిన సంగతి అందరికీ తెలిసింది. ఆ వార్త అయోధ్యకు శీఘ్రంగా చేరుకుంది. రాముడి చెవిని కూడా పడ్డది. అంతఃపురంలో సీతకు కూడా తెలిసింది.

అంతఃపురం మీదినుంచి సీతాదేవి చూస్తూండగా, ఇద్దరు పిల్లలతో వస్తున్న యశోధర కనిపించింది. యశోధర సౌధాన్ని సమీపించి, ''అమ్మా, జానకీ! భిక్ష పెట్టించు! పతి భిక్ష పెట్టించు, తల్లీ!'' అని ఎలుగెత్తి అరిచింది.

''అమ్మా! నీ భర్త, హనుమంతుడి ఆశ్రమంలో క్షేమంగా ఉన్నాడని తెలిసింది. అతని కింక ఎటువంటి భయమూ ఉండదని నమ్మ. నీవూ, పిల్లలూ యిక్కడే నాతో ఉండండి!'' అని చెప్పి అంతఃపురంలో వారికి సకల మర్యాదలతో విడిది ఏర్పాటు చేయించింది. ఆ పిల్లలిద్దరికీ సీత దగ్గర మంచి చనువు ఏర్పడింది. అటువంటి పిల్లలిద్దరు తనకు ఉంటే బాగుండునని సీతకు సంతాన వాంఛ కలిగింది.

రాముడు ధనుర్బాణాలను ధరించి యయాతిని వధించడానికి పాదచారిగా బయలుదేరాడు. అతని వెనుక ముగ్గురు తమ్ములూ, వారి వెంట మంత్రులూ, పరివారమూ బయలుదేరారు. రాముడు తప్ప ఎవ్వరూ ఎటువంటి ఆయుధమూ పట్టుకోలేదు.

రాముడు దగ్గిరకు రాగానే హను మంతుడు స్వాగతవచనాలు పలికి, దోసిట్లోని పువ్వులను, అతని పాదాల ముందు జల్లాడు.

హనుమంతుడు రాముడి పాదాల ముందు మోకరిల్లి, "రామా! యయాతిపై అనుగ్రహం చూపు! అతడు నిరపరాధి. బలహీనుడైన వాణ్ణి దండించడం నీవంటి వానికి తగదు. అతని పక్షాన నేను వేడుకొంటున్నాను," అని అన్నాడు.

రాముడు ఆగ్రహంతో, "ఓహో. నాకే చెప్పగలంతటి వాడి వయ్యావా?" అంటూ హనుమంతుణ్ణి పాదంతో తన్నాడు.

ఆ తాపుకు హనుమంతుడు పరవశించి పోతూ, "ఏ పాదం తాకగానే బండరాతికి శాపవిమోచనం కలిగి, అహల్యగా పవిత్రత పొందిందో, అటువంటి నీ పాద స్పర్శతో నా మేను యిన్నాళ్ళకు ధన్యమైంది. ఇప్పుడు నా శరీరానికి అపూర్వమైన శక్తి వచ్చింది," అన్నాడు.

రాముడు తిరిగి మండిపడుతూ, "ఓరి, వానరా! ఇంటువంటి కల్లబొల్లి పొగడ్తలు కట్టిపెట్టి, యయాతిని విడిచిపెట్టు. గురువాజ్ఞను నేను నిర్వర్తించాలని యిక్కడకు వచ్చాను!" అన్నాడు.

"రామా! నీ గురువు ఆజ్ఞ యెంత అన్యాయమైనదో గుర్తించకుండానే,



నిష్కారణంగా ఒక అమాయకుణ్ణి చంపాలని నీవు వచ్చావు! తల్లిమాట నిలబెట్టడం కోసం నేను యయాతికి రక్షగా నిలబడ్డాను. ముందు నన్నుచంపి, తర్వాత నీవు వచ్చిన పని చూసుకో!" అని హనుమంతుడు గంభీరంగా లేచి నిల్చున్నాడు. ఉన్నట్టుండి హనుమంతుడి శరీరం పెరగసాగింది. నిగనిగలాడుతూ ప్రకాశాన్ని విరజిమ్మసాగింది.

అది చూచి రాముడు, "ఓ, ఇంత వాడివయ్యావా? ఏదో ఒక వానరుడివనే అనుకున్నానుగాని, నా కెదురునిలిచేటంత వీరుడివి అవుతావని అనుకోలేదు!" అన్నాడు హేళనగా.



రాముడు వింటిని పైకెత్తి, నడినెత్తి ఆకాశానికి గురిపెట్టవలసినంత పని అయింది. అప్పుడు హనుమంతుడు వీరాసనం వేసి కూర్చుని, "రామా! ఇప్పుడు నీ గురికి కొంత అందుబాటులో ఉంటాననుకుంటాను!" అన్నాడు.

రాముడు ఒక్కసారిగా మహోగ్రుడై, "ఇప్పుడు చిట్టచివరిగా నా రామబాణాన్ని, నీ గుండెకు గురిపెట్టి ప్రయోగిస్తున్నాను. దీనితో నీ పనీ, నా పనీ ముగుస్తుంది," అంటూ చంద్రవంక ఆకారం గల రామ బాణాన్ని తీశాడు.

విశ్వామిత్రుడు కూడా పరుగున వచ్చి రాముడితో, "రామా, ఇక నీవు యుద్ధం మాని హనుమంతుడి పట్ల ప్రసన్నుడివి కావాలని కోరుతున్నాను. నా అహంకారం, ఇదంతా చూశాక నశించింది. యయాతి దోషమేమీ లేదు," అన్నాడు.

రాముడు తల అడ్డంగా ఊపుతూ, "లేదు, గురుదేవా! ఇంకా నా అస్త్రం మిగిలే ఉన్నది. మీ ఆజ్ఞ నెరవేర్చి తీరుతాను. నన్ను వారించకండి," అని కసిరినట్టు అన్నాడు.

రాముడు అస్త్రాన్ని నారికి సంధించి, హనుమంతుడికి గురిపెట్టి, "హనుమా! నా రామబాణాన్ని నీ గుండెకు గురి పెడుతున్నాను; ఇప్పుడైనా నీ అహంకారం

"రామా! అది అంతా నీ పాద మహిమే అని ఇప్పుడే గద చెప్పి ఉన్నాను!" అన్నాడు హనుమంతుడు.

రాముడు ధనుస్సు తీసి బాణాన్ని సంధించాడు. హనుమంతుడు తన తోకను పెంచి గిరగిరా తిప్పుతున్నాడు. రాముడు ప్రయోగించిన అస్త్రాలన్నిటినీ హనుమంతుడు తోకతో అడ్డుకొని, గిరవాటేస్తున్నాడు. ఆ సమయంలో విశ్వామిత్రుడు కూడా అంగలువేస్తూ అక్కడకు పరుగు, పరుగున వచ్చాడు.

రాముడు వేసిన ఒక్కొక్క అస్త్రానికీ, హనుమంతుడు శరీరాన్ని పెంచుతూ, మహోన్నతంగా పెరిగిపోయాడు.

విడిచి, యయాతిని నాకు అప్పగించి, రాముని బంటువనిపించుకో!'' అన్నాడు.

హనుమంతుడు, "అప్పుడూ, ఇప్పుడూ, ఎప్పుడూ నేను రాముని నమ్మిన బంటునే! శరణు యిచ్చి వదిలివేసే క్షుద్రుడు నీకు బంటుగా ఉండతగడు. అది నీకే చిన్నతనం! త్వరగా నీ రామబాణాన్ని వదులు, హృదయపూర్వంగా నీ బాణానికి స్వాగతమిస్తున్నాను,'' అంటూనే హనుమంతుడు రెండు చేతులతోనూ తన గుండెను చీల్చి అస్త్రానికి సూటిగా పట్టుకున్నాడు. రాముడు బాణాన్ని వదిలాడు. ఆ బాణం హనుమంతుడి గుండెలో చొరబడుతూ అదృశ్యమైంది. అప్పుడు హనుమంతుడి గుండెలో దేదీప్యమానంగా ప్రకాశిస్తూ రాముడి రూపం కనిపించింది. ఆ అద్భుతాన్ని అంతా నిశ్చేష్టులై చూస్తూ ఉండిపోయారు.

రాముడు ధనుస్సు కిందకు దించి, ''హనుమా! నువ్వు అజేయుడివి! నేనే ఓడిపోయాను!'' అన్నాడు.

అప్పుడు హనుమంతుడు, గుండెను చీల్చి పట్టుకున్న చేతులు వదిలిపెట్టగానే, గుండె యథాప్రకారం మూసుకున్నది. ''రామా! ఇందులో జయాపజయాలు ఎవరివీ కావు. నీ అస్త్రాన్ని నా హృదయంలో ఉన్న నీవే గ్రహించావు. అదీ నీలోనే లీనమైంది. ఇందులో నా ప్రతాపమేమీ లేదు,'' అన్నాడు హనుమంతుడు తలవంచి నమస్కరిస్తూ.

విశ్వామిత్రుడు వచ్చి హనుమంతుణ్ణి దగ్గరకు తీసుకొని, ''హనుమంతా! శరణాగత రక్షణలో నీవు, రాముడంతటి వాడితో ఎదురొడ్డి, ప్రతిజ్ఞాపాలన నెరవేర్చి, ఇప్పుడు అసలైన వీరుడివనిపించుకున్నావు; వీరహనుమానుడని సార్థక నామధేయుడివైనావు,'' అని ఎలుగెత్తి శ్లాఘించాడు.

రాముడికీ, సీతకూ వందనాలు చేసి, వారికి వీడ్కోలు చెప్పి, హనుమంతుడు గంధమాదన పర్వతం మీద తపస్సులో నిమగ్నమయ్యాడు.





# వాయిదాపడిన బహుమానం

మణ్యూరు యువరాజు యశోధర్ముడు తన మిత్రులతోనూ, పరివారంతోనూ అరణ్యంలో ప్రవేశించి వేటాడనారంభించాడు.



యువరాజుకు అందమైన జింక కనిపించింది. అతను గుర్రం దిగి జింకను బాణంతో కొట్టబోయాడు. జింక మెరుపులాగా పరుగుతీసింది. రాజు దాన్ని వెన్నంటి తన పరివారానికి దూరమయాడు.



అతను అలసి, దప్పిగొని ఉండి, ఒక స్వచ్ఛమైన ప్రవాహన్ని చూశాడు.



అతను సేదదీరగలందులకు ప్రవాహంలో దూకి, దానివేగానికి కొట్టుకు పోసాగాడు. అప్పుడొక యువతి అతనికి ఒక బల మైన లతను అందించి, అతని ప్రాణం కాపాడింది.



ఆమె ఒక బ్రాహ్మణుడి కూతురు. అతను ఆమెకు ఎన్నో బహుమతులు ఇస్తానన్నాడు.' ఆమె వాటిని నిరాక రిస్తూ, తనకు బహుమతి కావలసి నప్పుడు కబురు చేస్తానన్నది.





అనేక సంవత్సరాలు గడిచాయి. బ్రాహ్మణుడి కుమార్తె మధురలో ఒక పూజారిని పెళ్ళాడింది.

యశోధర్ముడు రాజు అయాడు.

హూణులు మాల్వాలో తిష్ఠవేశారు. వారి నాయకుడు మిహిరగులుడు అప్పు డప్పుడూ దండయాత్రలు చేసి, పట్ట ణాలు తగలబెట్టి, జనాన్ని చంపుతుండే వాడు.





హూణులు మథురలో ఒక దేవా లయాన్ని కొల్లగొట్టారు. ఆ దేవాలయ పూజారినే బ్రాహ్మణకన్య పెళ్ళాడింది. పూజారితోబాటు అతని భార్యనూ, కుమార్తెనూ కూడా హూణులు నిర్బం ధంలో ఉంచారు.

పూజారి కుమార్తె చాలా చక్కనిది. ఆమెను తనకిచ్చి పెళ్ళిజేస్తే, ఆమె తల్లి దండ్రులను వదిలేస్తానన్నాడు హూణ నాయకుడు.





ఇందుకు పూజారిగాని, అతని భార్య గాని, కుమార్తెగాని ఒప్పుకో లేదు. పూజారి భార్య ఒక వ్యక్తి ద్వారా యశోధర్ముడికి కబురుపంపింది— తనకు బహుమానంగా హూణులతో యుద్ధం చెయ్యమని.



యశోధర్ముడు వెంటనే మరికొందరు రాజులను కలుపుకుని, హూణుల మీద దండెత్తి వచ్చి, వారిని చిత్తుగా ఓడించి, గొప్ప విజయం గడించాడు.



తన ప్రాణం ఒకనాడు కాపాడిన స్త్రీని బంధ విముక్తురాలిని చెయ్యటానికి వెళ్ళేసరికి ఆమె చనిపోయి ఉన్నది. రాజు విలపించి, ఆమె ఋణం తీర్చు కున్నందుకు తృప్తిచెందాడు.

# కథా శీర్షిక పోటీ

## ఈ కథకు మంచి పేరు పెట్టి రు 25 లు గెలవండి!

## ?

శ్రీగిరి గ్రామంలో అందరూ రైతులే. స్త్రీ పురుషులు సమంగా కష్టపడి పని చేసేవారు. అయితే, మల్లన్న భార్య మల్లమ్మకు మూఢవిశ్వాసాలు జాస్తి; మంత్రాలూ, తంత్రాలూ, తాయెత్తులూ సంపాదన పెంచుతాయనీ, శ్రమవల్ల కన్న వాటితో అతి తేలికగా ఫలితం ఉంటుందనీ ఆమె నమ్మకం. అందుచేత ఆమె గుళ్ళూ, గోపురాల చుట్టూ తిరుగుతూ, ఇంటి పనీ, పొలం పనీ నిర్లక్ష్యం చేసింది.

చివరకు ఆమె ఒక గడ్డను తెచ్చి, దానికి పూజచేసి, దాన్ని గాదెలో ఉంచుతూ, అది ధాన్యపు గడ్డ అనీ, దాన్ని ఒక సాధువు ఇచ్చాడనీ, దానితో గాదెలు ధాన్యంతో నిండిపోతాయనీ భర్తకు చెప్పింది.

మర్నాడు మల్లన్న ఝాముపొద్దెక్కి కూడా లేవలేదు. మల్లమ్మ అతన్ని లేపి, "ఏమిటి, ఇంత పొద్దెక్కి కూడా పొలానికి బయలుదేరలేదు?" అన్నది.

"గాదెలో ధాన్యపు గడ్డ ఉన్నదిగా? గాదెలు నిండుతాయి! నేను రెక్కలు ముక్కలు చేసుకోవటం కూడా దేనికి?" అన్నాడు మల్లన్న.

ఆ మాటతో మల్లమ్మ కళ్ళు తెరుచుకున్నాయి. గాదెలో నుంచి ధాన్యపు గడ్డ పోయింది. మల్లమ్మ భర్తతోబాటు చచ్చినట్టు శ్రమ చెయ్యసాగింది.

—మారుపాక మంజూరాణి

★ ★ ★

పై కథకు మంచి పేరు ఆలోచించి ఒక కార్డు మీద మాత్రమే, మీ చిరునామాతోపాటు రాసి, "కథా శీర్షిక పోటీ", చందమామ, 2&3 ఆర్కాట్ రోడ్డు, వడపళని, మద్రాసు 600 026 అన్న చిరునామాకు పంపండి. కవర్లు వగైరా పరిశీలింపబడవు.

కార్డులు మాకు ఫిబ్రవరి 20 లోగా చేరాలి. అందులో ఫోటోవ్యాఖ్యలు చేర్చరాదు. ఫలితాలు, ఏప్రిల్ నెల చందమామలో ప్రకటించబడును.

---

డిసెంబర్ నెల పోటీ ఫలితం: తలరాతను తలదన్నే రాత

గెలుపొందిన వారి పేరు: ఆర్. శ్యామల, కొవ్వూరు. (పశ్చిమ గోదావరి జిల్లా)

# ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1978 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.







P. V. Subramaniam S. G. Seshagiry

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ ఫెబ్రవరి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## డిశెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : సరదా పడవ

రెండవ ఫోటో : పడవ సరదా

పంపినవారు : బి. రాజారావు, చింతగుంటపాలెం, మచిలీపట్నం.

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI. CHANDAMAMA is published monthly and distributed in U.S.A. by Chandamama Distributors, West Chester PA 19380. Subscription 1 year $ 6-50. Second Class Postage paid at West Chester, PA.

# రామ్, శ్యామ్ వలలో తప్పించుకున్న ఏనుగు






















నోరూరించే
మనసుదోచే
మైమరపించే




## పార్లే పాపిన్స్



పండ్లరుచిగల పిప్పరమెంట్లు

5 పండ్ల సువాసనలలో– రాస్ప్‌బెరి, అనాస, నిమ్మ నారింజ, మోసంబి.

everest/871/PP-tl